శ్రీరస్తు.

# శ్రీజగన్నాథమాహాత్మ్యము.



## చెఱకువాడ సూరఁగామాత్య ప్రణీతము.




రాజమహేంద్రవరము,

చిడమర్తి వెంకటకృష్ణమూర్తి అండ్ బ్రదర్సు వారిచే,

శ్రీకృష్ణాముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1925.

   [వెల రు 1-0-0.



# పీఠిక

ఈ శ్రీజగన్నాథమాహాత్మ్యమును రచించిన మా తండ్రిగారు చెఱుకువాడగ్రామకాపురస్థులు. వీరు 1803 సంవత్సరమున జన్మించిరి. తండ్రి రామయార్యుఁడు. తల్లి బాపనాంబ. వీరు 1860 సంవత్సర ప్రాంతమున నీగ్రంథమును రచించిరి. బాల్యమునుండియు శ్రీరామ పదారవిందసేవాపరాయణులై విష్ణునే పరదైవముగా నమ్మి వీరు రచించిన గేయమంత్రములు గలవు. వానిలోఁ గొన్ని యిప్పటికిని భక్తులచే మాయూర దైవకార్యసందర్భములఁ బాడుచుందురు.

వీరు నిత్యమును భారత భాగవత రామాయణములను పారాయణ మొనరించుచుండెడివారు. భారతమునంతయుఁ దాళపత్రములపై స్వహస్తముతో లిఖించికొనిరి.

మఱియే యితరకారణములు నులేక భక్తిపారవశ్యముచేతనే యీ గ్రంథమును రచించిరని తలఁపనగును. ఈ గ్రంథము పూర్తియైనప్పటికి నాకుఁ బండ్రెండేండ్లవయస్సున్నది. అప్పుడు నరసాపురమందున్న మాయన్నగారైన వేంకటాద్రియయ్యగారు దీనిని ముద్రింపఁగుతూహలులై వ్రాఁతప్రతిని గొనిపోయి యచిరకాలముననే స్వర్గస్థులగుట వలన గ్రంథమును గూర్చినవిషయమేమయినదో మేము తలఁపెట్టమైతిమి. సుమారిఱువది వత్సరములక్రిందట నాకు జ్ఞాపకమున్న నీగ్రంథములోని భక్తిరసప్రధానమైన పద్యములలోఁ గంఠస్థమైన వానిలో

నొకదానిని నేను జదువఁగా నాజ్యేష్ఠకుమారుఁడు సూరయ ఈపద్య మెచ్చటిదని ప్రశ్నించెను. అప్పుడీ వృత్తాంతమంతయు వానికెఱిఁగించితిని. అందుపై నాతఁడు విచారించి గ్రంథసంపాదనాతత్పరుండై మా పినతండ్రిగారికుమారునింట శిథిలావస్థలోనున్న యొకప్రతిని సంపాదించి బహుజాగ్రత్తతో దానినుండి మఱియొకప్రతినివ్రాసి, యచ్చొత్తింప నుద్యుక్తుండై, మనోరథమీడేరకముందే కాలధర్మమునొందెను.

ఈనడుమ నాద్వితీయ పుత్రుఁడు చిరంజీవి వేంకటాద్రియయ్య యచ్చొత్తించెదనని యాప్రతిని రాజమహేంద్రవరము కొనిపోయి పండితపరిష్కారమునుగోరి పండితులు "పరవాగ్దోషనావిముఖు" లను సంగతినెఱుంగక కాలహరణమునకు సైంచి విఫలమనోరథుండై గ్రంథ మున్నదున్నట్లె యచ్చొత్తించెను. సరళహృదయులగు విద్వాంసుల యాదరణమున ద్వితీయముద్రణమున నిందుదోషములున్న సవరింపఁబడుఁగాక!.

చెఱుకువాడ,
ది 1—2—1925.

సుజనవిధేయుఁడు,
చెఱుకువాడ వేంకటశర్మ ము:

# కథాసంగ్రహము.

ఇంద్రద్యుమ్నరాజేంద్రుండు శమనావతీపురం బేలుచుండ, నందులవు బ్రహ్మనాభిధేయుండగు బ్రాహ్మణుండు వచ్చి పుత్రజన్మావధిగా సతీసహితంబు లోకాంతరగతుండైన నక్కుమారుం దెచ్చి యతండు పుత్రప్రియునిగాఁ బెనిచి సకలవిద్యాసనాథుఁ జేయుటయు నిమ్మట నబ్బాలుండు ప్రాగ్దక్షిణపశ్చిమదేశంబులు జూచి వచ్చి తత్తద్విశేషంబులు రాజున కెఱింగించుటయు నుత్తరంబునకుం బోయి యందొక్క వనమ్మునం బడి పరిభ్రమించి, దైవవశంబున వెలువడి నీలాచలసమీపంబున నున్న హరిసేవకులపురంబు జేరి యం దొక్క కన్యకానుగ్రహంబున భగవంతుని దర్శించి కృతార్థుండై రాజుం దోడి తెచ్చి దర్శనంబు చేయించుటకు స్వామియనుజ్ఞ వడసి, స్వపురంబు జేరి, రాజుం దోడ్కొని నీలగిరిగహ్వరంబు చేరంబోయి యచట స్వామిసేవకులచే బ్రమాదముం బొంది, వెండియు స్వామిని సేవించి, రాజునకు స్వామిదర్శనంబు సేయించుటయు రాజును, నీలశైలవాసునకు దేవాలయంబులు గట్టింప ననుజ్ఞ నొంది యీశ్వరాజ్ఞానుసారంబుగా నయ్యర్చకాంగనను యజ్ఞనార్యునకు బరిణయం బొనర్చి, దేవాలయనిర్మాణంబు గావించి, భగవన్నిర్దిష్టదారుత్రయంబున విశ్వకర్మపుత్రిముండగు వృద్ధశిల్పిచేత విగ్రహనిర్మాణంబు గావించి ప్రతిష్ఠార్థంబు బ్రహ్మ నాహూతుంజేయ తల్లోకంబున కరిగి మసలుట, విగ్రహంబు లన్యప్రతిష్ఠితంబులగుట బ్రహ్మవలన విని భూమికి వచ్చి తనకృషి తనవలన సాంతంబు గాదాయె నని దీనవదనుండై చింతించుచుండ భగవంతుండు సాక్షాత్కరించి స్థలాంతరమున దేవాలయనిర్మాణంబు

జేసిన సద్బాదియందు ద్వాదశదినంబులు తా నచ్చట వసించి దర్శించిన వారికి వత్సరంబు కైంకర్యము జేసినఫలం బొసగుచు నని నుడువుటయు భూపతి యట్లె గావించి కొంతకాలంబు రాజ్యంబు చేసి, కలిసమాకృతంబగుట జేసి యిప్పుడమి నుండ నొల్లక రాజ్యము పుత్త్రాధీనంబు గావించి స్వామ్యనుగ్రహంబున సకుటుంబముగా యష్టనతోడరా, పుత్రపౌత్రకళత్రంబులతో వైకుంఠమున కేగుటయు సంవలి మాఖ్యాంశంబులు:—

## తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 2 | 1 | మయూఖ | మయూఖ | 46 | 2 | మంళము | మంగళమ |
| | 11 | సగంబు | గంబు | 49 | 15 | రమ్మ | రమ్య |
| | 19 | విమత | వినుత | 53 | 13 | కరన | కరక |
| 4 | 5 | రోజు | రోజ | 57 | 19 | గేవశ | గేశవ |
| 5 | 18 | బుద్ధండ | బుద్దండ | 62 | 17 | దాడ | డాడ |
| 7 | 19 | మానము | మానము | 69 | 10 | సతోర్యశ్చ | సత్యాశ్చ |
| 14 | 18 | సాంబోజ | సాంభోజ | 71 | 13 | ర్ప | ర్వ |
| 15 | 23 | శ్రద్దా | శ్రద్ధా | 75 | 15 | ఫలించె | పలించె |
| 16 | 18 | నేర్బునే | నేర్చునే | 78 | 22 | సిక్తము | సిక్తము |
| 17 | 12 | గురిని | గురుని | 93 | 22 | దుర్గమి | దుర్గమం |
| 18 | 2 | సంప్రాప్తం | సంప్రాప్తం | 113 | 14 | జర్జించి | జర్పించి |
| 25 | 4 | దర్శనంబు | దర్శనంబును | | 18 | దృవుంద | దృప్తాండ |
| 28 | 13 | గమంగొని | గనుంగొని | | 19 | దెవా | దేహా |
| 33 | 20 | లానంద | లానంద | 114 | 19 | నమస | సమస్త |
| 44 | 6 | హాసితా | హాసితా | 115 | 3 | ద్యానం | ధ్యానం |
| 45 | 19 | సత్కృపా | సత్కృపా | | | | |



శ్రీరస్తు.

శ్రీగణాధిపతయేనమః.

# శ్రీ జగన్నాథమాహాత్మ్యము.



## ప్రథమాశ్వాసము.

—:o:—

శ్రీ సీతారమణీమణీహృదయరాజీవప్రియాకార! కై
లాసాహార్యసమానధీర! వరప్రహ్లాదాదిభక్తావనో
ల్లాసాధార! సమస్తదేవమునిజాలస్వాంతసంచార! స
ద్దానానందకరప్రచార! రఘునాథా! భద్రశైలాధిపా!

వ. దేవా! భవదీయదివ్యనామాంకితంబుగా నెద్దియేనియు నొక్క పురాతనపుణ్యేతిహాసంబు సమధికచమత్కృతియాపన్యాసంబుగా రచియింప దలంచి యున్నయెడ మదీయపుణ్యవిశేషంబున శ్రీజగన్నాథమాహాత్మ్యం బనువచనకావ్యంబు గద్యపద్యాత్మకంబుగా గ్రంథకల్పనం బొనర్చుటకు నుపలబ్ధావకాశుండ నైతిం గావున భవద్దాసుండ నగు నేను దత్కథాక్రమం బభివర్ణించెద. 2

తే. అవధరింపుము దేవ! మహావిచిత్ర
చిత్రితర మైనభవదీయచిద్విలాస
మనఘ! వినిపించెదను విను మతిశయాను
రాగరసపూరితాపాంగరంజనముగ. 3

మ. కల దాక్షిణ్యయశస్సుధాకరమయూఖాళీపరిక్షాళితా
ఖిలభూమండలదిక్కటాహమిళితైకీభూతజంతువ్రజో
త్కలికాక్షిణ్యమహాయావిమర్శగిరిభిత్ప్రద్యుమ్నుఁడై నట్టిస్వా
ర్గలసన్నాహమధరామనోరమణుఁ డింద్రద్యుమ్నచంద్రుఁ డిలన్.

సీ. ఏప్రభుని భూరిప్రతాపాగ్ని కనిలాప్తు
డంబుప్రవేశనాహృతి నడంగె
ఘనత నెవ్వరి తేజమునకు దివాకరుఁ
డస్తమయావస్థ నసముఁ డయ్యె
మహనీయగాంభీర్యమహిమచే జడనిధి
సేతుభంగవ్యాజశిథిలుఁ డయ్యె
గురుధైర్యభరముచే హరశరాసనగంబు
లోగి గతాగతవృత్తి నగము లయ్యెఁ

తే. దలఁప నసహాయవీరప్రతాపశాలి
రంజితాఖండతేజోవిరాజమానుఁ
డసదృశాభంగగాంభీర్యుఁడ తులితోరు
ధైర్యనిశ్చలుఁ డనఁగ నిద్ధాత్రి నెగడె. 5

కం. చంద్రసమానయశుం డగు
నింద్రద్యుమ్ను నకుఁ దుల్యు లెన్నఁడు లేరం
చింద్రాద్రివినుతభేరీ
సాంద్రధ్వని ఝూమ్మటంచు జగతిం బర్వెన్. 6

సీ. ఏసార్వభౌముం డహీనదక్షిణలతో
నశ్వమేధశతంబు లమరఁ జేసె
నేగుణాగణ్యుం డనేకాగ్రహారంబు
లతిభక్తితోడ బ్రాహ్మణుల కిచ్చె.

## ప్రథమాశ్వాసము.

నేపుణ్యపూరుషుం డాపజ్జనావనో
దారుఁ డై ధరణి సత్రములు నిలిపె
నేనై భవాఢ్యుండు దేవాలయారామ
కృతికూపసత్రసంతతుల నెరపె
తే. నట్టిమహనీయచరితు సూర్యాన్వయాబ్ధి
పూర్ణిమాచంద్రు సకలదిక్పూరితాచ్ఛ
కీర్తిసాంద్రుని బొగడంగ గీష్పతికిని
నాగపతికి విరించికి నైన వశమె?
సీ. నెల మూఁడువర్షంబు లిల సమృద్ధిగఁ గల్గు
గోవులు గురియుఁ బాల్కుంభవృష్టి
వ్యాధితస్కరముఖబాధ లేమియు లేవు
భర్తృవిహీన యాభామ లేదు
జనకు లుండఁగ సుతు ల్చనిపోవుటయు లేదు
సంపద లేనిసంసారి లేఁడు
విశ్వాసఘాతకు ల్వెదకి చూచిన లేరు
ధర్మంబు నాల్గుపాదముల నడచు
తే. గీ. నట్లు పరిపాలనము జేసె నవని యెల్ల
భూతదాక్షిణ్యనుగుణసంపూర్ణు డతఁడు
సర్వసమ్మతవర్తి నిర్గర్వమూర్తి
జగతి నెగడె నిందద్యుమ్నచక్రవర్తి.
తే. దీనరక్షణకల్పసమాను డైన
మానవేంద్రునిమహిలో నిమనుజులకును,
లేమి యనుమాట కెంతయు లేమి గలిగె
జ్ఞానయోగీంద్రునింద్రియచయమునట్లు.

వ॥ మఱియు నద్ధరాపురందరున కధిష్ఠానం బగుపురంబును దద్వైభ
వంబులను వివరించెద. 10

సీ. కాశ్మీరదేశంబు గలదు ధరాస్వర్గ
మనఁగను సకలభోగాన్వితంబు
హిమవదుత్తరభాగ మిలనర్థశతయోజ
నాయామ మగుకోసలాఖ్యదేశ
మకలంకజనసేవ్యనికటంబు సరయూన
దీపరీవాహోదకదివ్యతటము
మానితం బగురాజధాని యై శమనావ
తీపుటభేదనం బేపు మిగిలె
తే. పాకశాసనధనదాదిలోకపాల
వరమనఃపుటభేదనస్ఫురిత మైన
సకలధనధాన్యవస్తుసంచయసమాంత
వర్ణితాఖండసంపత్ప్రపూర్ణ యగుచు. 11

కం. ఆశమనావత్యవలో
కాశ శతమఖముఖసుర లన్యవిలోకే
చ్ఛాశూన్యహృదయు లగుచో
నాశాపతు లైరి నాఁటనాటికిఁ జూడన్. 12

వ॥ అట్టి పట్టణలలామంబునందు, 13

మ. శతమానంభవతీతియన్విధికి తచ్చాతుర్ముఖోదీరిత
ప్రతిపత్తిన్ సమవాయవృత్తికలనాబాహుళ్యతం దీర్ఘజీ
వితులం జేతురు తద్ధరాజనులఁ బృథ్వీదేవతల్ వేదశా
స్త్రతపస్సంయమసత్యశౌచగరిమాసంయూఢవాచార్భటిన్. 14

మ. విమలబ్రహ్మవిఘాతవృత్తి గురువిద్వేషోపపత్తిం బర
ప్రమదాసక్తియుఁ గల్గురాజధరుఁడుం రాజుం శచీరాజు మ
త్సమ మెట్లుండు ధరామరార్థ గురుపూజాసక్తి నన్యాంగనా
విముఖోక్తిన్ శమనావతీపురిన్నృపుల్ విఖ్యాతచారిత్రులై. 15

చ. తనసఖుభైత్యవృత్తిం గని ద్రవ్యము దాచినయాకుబేరునిన్
ధనదవరాభిధాన మొటు దా నగు సార్థక మంచుఁ బల్కుచున్
ఘనముగ వస్తుజాలములు గాంచనరత్నము లాసకోటికి
న్ననవరతంబు దా మిసుమ రప్పురివైశ్యు లభీష్టసిద్ధిగన్. 16

కం. ధరణీసురవరచరణాం
బురుహపరాగకలితోర్ధ్వపుండ్రవిభూషో
త్కరు లప్పురిచరణోద్భవు
లురుభుజబలశౌర్యశాలు లుత్కృష్టులిలన్. 17

వ. ఇట్లు సకలవర్ణపరిపూర్ణంబగు నప్పట్టణాధీశ్వరుం డగు రాజపరమేష్ఠి యఖండరాజయోగానందచిద్విలాసప్రశంసు లగు పరమహంసలు రాజహంసలుగా, తర్కవ్యాకరణమీమాంసాప్రభాకరభాట్టాద్యఖిలవాక్యార్థవిషయైకీభూతబ్రహ్మాండాదిపురాణప్రతిపాదితబ్రహ్మవిష్ణ్వద్వైతాద్వైతవిశిష్టాద్వైతాదిమతసిద్ధాంతప్రామాణ్యవాక్యోపన్యాసముచ్చారితోచ్చస్వరవిభాసమానోత్తంసు లగువిద్వాంసులు కోయష్టికచక్రవాకక్రౌంచకారండవసారసాద్యపరిమితపతంగపుంగవులుగాఁ గవిభటగాయకవందిమాగధవైతాళికవాంశికోద్గీర్ణవర్ణితం బగాధజలావగాహనఝలీకుళీరమకరకచ్ఛపతిమితిమింగిలాది జలజంతుఘూర్ణితంబుగా భేరీమృదంగకాహళపటహపణవాదివిజయఘోషంబు లుపయోధినిసదంబుగాఁ గనకఖచితరత్ననిర్మితంబు లగుహర్మ్యగోపురప్రాకారప్రాంగణవేదికాగేహాళీప్రదేశంబులు బాడబానలప్రభాచ్ఛాదితమరకతపుష్యరా

గవజ్రవైడూర్యగోమేధికాదినవరత్నజన్మప్రదేశంబులుగాఁ జంద్రకాంత
శిలాఘట్టితసోపానశిలాయంత్రవీథికాజాలంబులు సైకతస్థలంబులుగా
ముక్తామయవితానవిద్యోతమానచ్ఛత్రచామరాందోళికాపరిభ్రాజద్ధావ
ళ్యదాళధళ్యం బహీనఫేనసముదయంబుగా సకలావయవసౌందర్యవిశే
షావమానితదేవకామినులగు విలాసినీజనం బప్సరోవనితలుగా వల్గువ
ల్గనసముత్కటనటనోత్తుంగతురంగంబులు తరంగంబులుగా, సకలకన్న
బనేకపసముత్పాటనపాటవోన్మత్తసామజంబులు మైనాకాదిశైలసమూ
హంబులుగా సకలకల్యాణభాజనం బై యొప్పునప్పట్టణక్షీరపారావారం
బున కయ్యింద్రద్యుమ్నరాజేంద్రుం డనవరతప్రవర్ధమానచంద్రుం
డగుచు సామంతమకుటతటఘటితమాల్యమణిప్రభాపటలధగద్ధగా
యమానపీతాంబరంబునం బురుషోత్తముం డై సకలలోకసంరక్షణధురీ
ణుం డయ్యును సకలజగజ్జేగీయమాననిర్వక్రపరాక్రమాగతాఖండయ
యశోమండనపాండురవిభాపరిపూరితకైలాసోదారశరీరత్వంబున సాక్షా
దుపేంద్రస్వరూపుం డై దుష్టజనశిక్షకుం డయ్యును సనకసనందనసనత్సు
జాతవసిష్ఠవామదేవాదిమహామునిజనవిభాసమానసభాసింహాసనాసీనుం
డై కేవలబ్రహ్మతేజోధికత్వంబున నిఖిలజనాభ్యుదయసంపాదకుం డ
య్యును ద్రయీమూర్తిధరుం డై సప్తసముద్రముద్రితం బగుభూవ
లయం బుద్దండభుజాదండమండితం బగుకోదండమున నసహాయశూ
రుం డై యేకచ్ఛత్రాధీశ్వరుం డగుచు జనమనోరంజకంబుగా రెండు
వేలసంవత్సరంబు లారాజసార్వభౌముండు ప్రజాపరిపాలనం బొనర్చె
నాసమయంబున, 18

సీ. అకలంకతీర్థయాత్రాసక్తి నిజసతీ
యుతు డయ్యె నొకభూసురోత్తముండు
నిష్ఠలసద్వంశనీరజభానుండు
బ్రహ్మనాభిఖ్యుండు పరమశాంతుఁ

డఖిలవేదాగమాధ్యయనపారీణుండు
పరమయోగారూఢభవ్యమూర్తి
సంప్రాప్తధనలాభసంతుష్టచిత్తుండు
పరధనపరదారపరిహారుండు
సుజనపూజితుండు సూనృతవాదియు
సకలతీర్థయాత్ర సలుప దలఁచి
యతఁడు వచ్చి చూచి యీనగరంబులోఁ
గొన్నిదినము లుండఁ గోర్కె నొదవి. 19

చ. మహిమను శుక్లవృత్తినియమాన్వితుఁడై యొకవీథి నన్నయా
గ్రహము నివాస మొప్పఁగ నభేదమతిం దగ నుండె భస్మసం
పిహితకృశానుభంగి ననపేక్షితుఁడై తనరూపమేమియు
న్విహితము గాక యుండఁగ ననింద్యతపోనియమాభిరాముఁడై.

కం. ఏతాదృగ్విధమహిమో
పేతుండై బ్రాహ్మణుఁడు పిత్ర్యాణార్తిపరి
త్రాతృసుతప్రాప్తికి బ
ర్వేతరముల భార్యతోడ గ్రీడించెఁ దగన్. 21

ఉ. ఆరమణీలలామ కరుణాంచితసీమ యరుంధతీందిరా
భారతిపార్వతీప్రముఖభవ్యసతీసుగుణాభిరామ యై
పారఁగ గర్భధారిణియునై నవమాసము లైన నప్పైఁ బ్రభా
పూరితగాత్రుఁ బుత్రుఁ గనెఁ బూర్వదిశాంగన భాస్కరుం బలెన్.

వ॥ ఇట్లనన్యసామాన్యప్రభాపటలపరిపూరితదిఙ్నభోభాగుండగు నక్కు
మారుం గని బ్రాహ్మణుండు పరమానందకందళితాంతరంగుండై జా
తకర్మాదిక్రియాకలాపంబులు తత్తత్కాలోచితంబులుగా నిర్వర్తించి
యబ్బాలునకు యజ్ఞేశ్వరప్రభాజాలుండు గావున సార్థకంబుగా యజ్ఞ

న్న యనునామకరణంబు జేసి యతనిసౌందర్యవిశేషంబునకు జననీజన
కులు సంప్రీమోదాయత్తచిత్తు లగుచుం బరులకు దృష్టిగోచరుండు
గా కుండం బుత్రసంరక్షణం బొనర్చు చుండి రంత. 23

తే. అయిదుమాసంబులకుఁ దల్లి యన్యలోక
సద్గతిని జెంద జనకుండు సంభృతార్తి
శోకుఁ డయ్యును ధైర్యవివేకుఁ డయ్యుఁ
జిత్తవిభ్రాంతిదూరుఁ డై శిశువుఁ జూచి. 24

వ॥ అపుత్రస్య గతి ర్నాస్తి యనువేదస్మృతివాక్యంబు గలదు గావునఁ
దద్విధానంబునకు లోపంబు గా కుండం బుత్రవంతుండ నైతి నని
యుం గాత్రత్రి పరివేదనేతిన్యాయావలంబంబునం దారవియోగంబు
నకు విచారింపం దగ దనియును స్త్రీపురుషులచేతం దనశిశువులు సం
రక్షణసాఫల్యంబులు గా నేర వనియెడుప్రతీతి గలుగుటంజేసి యిబ్బా
లునిపాలెపాల్యంబునకు నిశ్చయం బు లే దనియు నాయుర్దాయువంతుం
డడవిలో నైనను జీవించు నని బుధులవలన వినఁబడుఁ గావునఁ గాం
ణవశంబునం గాక మాన దనియును ధృతధైర్యం డై బ్రాహ్మణులిడు
పరోక్షభావంబున, 25

ఆ. ఓపినట్లు బ్రాహ్మణోత్తముఁ డాత్మత
నూజురక్ష సేయ నోజ మెరసె
శిశువు విదియనాటిచందురుఁ బోలుచు
దినదినంబు వృద్ధి గనుచు నుండె. 26

వ॥ తదనంతరం బ 27

తే. దైవగతి ధారుణీసురోత్తముఁడు భార్య
చనినపిమ్మట నాల్గుమాసంబులకును

గాలగతిఁ జెందె దైవసంకల్పమునను
విఘటనం బేమి లేదుగా విశ్రుతముగ. 28

కం. జననియు జనకుఁడు నిప్పరు
సునఁ బోవఁగ బాలుఁ డాప్తశూన్యుఁ డయి గృహం
బున ధరఁ బడి పొరలుచు రో
దనముం జేసెను మహాక్షుధాపీడితుఁ డై. 29

వ॥ ఇట్లక్కుమారుం డతికరుణంబుగా నేడ్చుచున్నం దత్పురపరిపా లకుం డగుకోత్వాలతనిం జూచి విస్మయభయభ్రాంతచిత్తుం డై తత్క్షణం బ చని సకలసామంతమంత్రిపురోహితబంధువర్గంబులతోడ సభాసీనుం డై యున్నయన్నరేంద్రుం గనుంగొని ముకుళితకరకమలుం డై దేవా! దేవరపట్టణంబున నొక్కగృహంబున జననీజనకసోదరాది విరహితుం డై దిక్కు లేనియొక్కయర్భకుం డతిదారుణంబుగా రోద నంబు సేయుచున్నవాఁ డల్లతిమనోహరాకారుం డగుకుమారు నెక్కా లంబున నేదిక్కుననుం జూడ లే దీవృత్తాంతం బంతయు విన్నవించు వాఁడ నై వచ్చితి నిటమీఁదటం భవదిచ్ఛాప్రకారంబున విచారింపఁ గల రనియునుం జెప్పి నిలువంబడియున్నయప్పరిచరాగ్రేసరుం గనుం గొని యధికదాక్షిణ్యగుణపవిత్రుఁ డగునారాజచక్రవర్తి యి ట్లని వితర్కించె. 30

శా. ఏమీ యిట్టివిచిత్రసంగతులు మున్నేమెప్డు మద్ధాత్రి వి
న్నామా? వైకృతి గల్గె నేఁటి కిది యన్యాయంబు మావల్లనే
యేమో వచ్చె నటంచు ఖిన్నుఁ డయి యాపృథ్వీశుఁ
డబ్బాలుఁ జూ
తాం మంచున్ మదిలోఁ దలంచె విలసత్కారుణ్యభావోన్నతిన్

వ॥ ఇవ్విధంబున నతివ్యాసంగమనస్కుం డై యక్కింకరుం గనుం గొని నీ వతిత్వరితగతిం జని యక్కుమారునిం దత్పరిచరసంచారు

లగుసంసారులం దోడ్కొని ర మ్మనవుడు వాఁడును నత్యంతసంభ్ర
మంబున డగ్గరం బోయి డగ్గుత్తికతోఁ బొత్తికలపైఁ జిత్తరం బగుపుత్త
డిబొమ్మయుంబోలె నొత్తిగిలి యున్నయప్పాపని నెత్తికొని తత్తరంబు
నం బార్శ్వవాసులకు రాజానుశాసనం బెఱింగించిన వారునుం దోడన
రా నతిశీఘ్రంబున సభాభవనంబున కరుగుదెంచుడు వాని కెదురుగా
నద్ధరణీవిభుండునుం బరతెంచి భటకరావృతపటాచ్ఛాదితుండయ్యును
గాంతిచ్ఛటా పటల ప్రకటీకృతదిక్తటనిటలాభిరాముం డగునక్కుమా
రలలాముం జూచి దీనజనాభయదానప్రశస్తంబు లగుదనహస్తంబులం
దిగిచి యక్కునం జేర్చుకొని యమందానందబాష్పబిందుసందోహుం
డై సింహాసనంబునం గూర్చుండి నిజాంకతలంబున నున్నశాబకశిరో
ముఖవిలోకనాద్యవయవశోభాలక్షణంబు లీక్షింపుచు నత్యాశ్చర్య
ధుర్యుం డై యారాజశేఖరుం డక్కొలువుం గలయం గనుంగొని వా
రలతో ని ట్లనియె. 32

కం. ఈచిన్నికొమరురూపము
వాచస్పతి కైన నెన్న వశమె ధరిత్రిన్?
ప్రాచీననవీనంబులఁ
జూచితి మే యెన్నఁ డిట్టిసొబగుకుమారున్. 33

ఉ. ఈమొగ మీవిలోకనము లీగళ మీభుజశాఖ లోష్ఠము
న్నీమహనీయనాసికయు నీపృథులాంసతలంబు లీమహో
ద్దామకరాంగుళాదికము తద్దయు నొప్పెడి సభ్యులార! సు
త్రామసుతుండొ కాముఁడొ సుధాకరుఁడో జనియించినారిలన్.

వ॥ అని యనేకవిధంబులం గొనియాడుచుం జనపాలుం డబ్బాలకుని
కులశీలనామంబులు తెలియువాఁడై తనభటునిచేత సమాహూతు
లై కొలువుకూటంబున నిల్వంబడి యున్నయవనీసురులం దనకటాక్ష

వీక్షణంబుల సమాధానసౌమనస్యంబు నెరపుచు నుచితాసనంబులం గూర్చుండ నియమించి శిశువ్యసనసమయంబునం దనచేసినప్రత్యుత్థానాభివందనాతివ్యతికరంబునకు క్షమాపణంబు నేర్పడం జెప్పుకొని యిక్ష్వాకువంశపూర్వోత్తరంబులు మీర లెఱింగిన తెఱంగున నాన తీవలయునని ప్రార్థించిన నారాజునకు వార లి ట్లనిరి. 35

సీ. విను మహారాజేంద్ర! ఘనుఁ డొక్కవిప్రుండు
రిత్వుండు నిజసతీయుక్తుఁ డగుచు
నరుదెంచి దేవతపురమున వసియించి
భైక్షాశనప్రవృత్తి దీక్షఁ బూని
కాలంబు గడపుచుఁ కడలేనిదారిద్ర్య
భరమున నుండ మే మరసి చూచి
ధారుణీధవు నిన్ను దర్శింపు మన్నను
జూడకుండెను ధైర్యసుస్థిరుండు
వేదవేదాంగవేది యుర్వీతలేశ!
జ్ఞానయోగనిరూఢుండు జనవరేణ్య!
సకలమంత్రిప్రభావుండు సార్వభౌమ!
విప్రమాత్రుండుగాఁ డయా విశదకీర్తి! 36

కం. ఆమహిమాన్వితుసతి పౌ
లోమీగిరిజాసనూయలోపాముద్రా
శ్రీమహిళారుంధతులకుఁ
బ్రాముఖ్యసతీసమానబహుమాన సుమీ. 37

వ॥ ఇ ట్లన్యోన్యవయోరూపగుణశీలసంపన్ను లగుదంపతు లివ్విధంబునం బ్రవర్తిల్లుచున్నసమయంబునఁ గొండొకకాలంబున కక్కాంతాలలామంబు గర్భిణి యై యిక్ష్వాకురత్నంబుం గని ప్రయత్నంబునఁ

తెన్నిధి గన్న పేదచందంబునం బొదలు చుండి రంతటం బ్రాప్తవశం బున నైదుమాసంబులకుఁ దల్లియు ననంతరంబున నాల్గుమాసములకుఁ దండ్రియు లోకాంతరగతిం బ్రాపించి రీశిశువతంసం బిట్టిదుర్దశాభాజ నం బగుటకు లోకం బతివ్యాకులం బగు చున్నయది. ఇతండు భవ దీయరక్షణార్హుండు గాని మాబోటిసామాన్యసంసారులచేతం బోష్యుం డు గానేరఁ డితని పూర్వవృత్తాంతం బిది. అనంతరసమాచారం బంత యు భవదాయత్తం బని విన్నవించిన, 38

మ. విని రాజన్యవరుండు విభ్రమదశావిర్భావరోమోద్గముం
డు నితాంతాశ్రుజలాభిషేకభుజగండోరస్థలుం డై కుమా
రునినస్మత్సుతుమాఱుగాఁ గరుణచేరూఢంబుగాఁ బెంచినం
జనకుం డెంతయు సంతసించును గదా స్వర్గంబునం దెంతయుఁ.

తే. ఈవిధంబునఁ బలుక భూదేవు లనిరి
దేవ! దేవత ల్మెచ్చిన దీవిధంబు
సకలజనసమ్మతం బన సందియంబె
చిరతరఖ్యాతి శిశువుఁ బోషింపవయ్య. 40

వ॥ సదస్యు లివ్విధంబున రాజానుమతంబున నొడంబడిన నతం డభ్యం తరమందిరమునకు నర్భకసమేతంబుగా జని తనదేవి కెఱింగించిన న య్యాదిగర్భేశ్వరి సమాధానం బని పల్కినఁ బ్రసన్నుం డై యాస్థా నంబునకు వచ్చి యచ్చట నున్న భూవియచ్చరుల కర్చన లిచ్చి వార లయాశీర్వాదనాదంబులు భేరీమృదంగాదిమంగళవాద్యంబులు చెలంగ నక్కుమారు నక్కనం జేర్చుకొని నల్దిక్కుల నాసీను లయి యున్నమ హాజనంబులలో నొక్కవృద్ధబ్రాహ్మణుఁ బుత్రపౌత్రవంతుం గనుం గొని మీర లీకుమారు నతికారుణ్యంబునఁ బ్రవర్ధమానుం జేసి మ త్ప్రార్థనంబు సార్థకంబు చేయ వలయు నని నిటలతటఘటితకరపుటుం

డై వేఁడికొనిన నతం డంగీకరణవాక్యంబులు పల్కినం బ్రహ్మిష్టమా
నసుం డై బాలుం బ్రాహ్మణాధీనుం జేసి వాత్సల్యంబున మణికటక
కాంచీకనకనూపురాదివిభూషణంబు లాశిశువున కొసంగి పోషకుం డగు
భూసురోత్తమునకు సమస్తద్రవ్యంబులు సమృద్ధంబులుగా నివేదించి
కార్యేతరపరిహారుం డై తత్కుమారసంరక్షణంబునం దేకాగ్రచిత్తుం
డై యహర్నిశంబునుం బరిపాలించుచుండె నంత. 41

కం. గర్భాష్టమకాలంబున
నర్భకు నుపనీతుం జేసి యఖిలాధ్యయనా
విర్భావమధురవాక్సం
దర్భునిగాఁ జేతు ననుచుఁ దలఁచి ముదమునన్,! 42

కం. ధీయుతు గరిమెళ్లాన్వయ
శ్రోయధిసోముండు ధిషణతుల్యుఁడు నగునా
రాయణపండితుని నుపా
ధ్యాయులగాఁ జేసె నద్ధరాధిపుఁ డెలమిన్. 43

వ॥ అయ్యుపాధ్యాయుల కపారధనంబులు కర్పూరతాంబూలాంబరా
భరణంబులు సమర్పించి యబ్బాలు నప్పగించిన నతండు సంతోషి
తాంతఃకరణుం డై విద్యాభ్యాసంబు సేయింపం దొడంగిన నయ్యజ్ఞ
ననామధేయుండు గురుపధేయుం డై కుశాగ్రబుద్ధి గావున వేదశా
స్త్రశ్రౌతాద్యఖిలగ్రంథంబులు శ్రవణమాత్రంబునం గ్రహణధార
ణోహాపోహసమర్థుం డై యధ్యయనంబు సేయుచు సకలసుజనానంద
కరుం డై యుండె నక్కాలంబున. 44

చ. గురునకు నప్పగించితిమి కూరిమిపుత్రిని విద్య లెవ్విధి
న్గఱపి రొ వాని గంచు నిజకాంతయుఁ దా నతిగౌరవంబుతో
నరయుగఁ బిల్వఁ బంచె నొకనాఁ డొగి వచ్చిరి వార లిద్దఱున్
ధరణిపుపాలికాతతముదంబున నప్డు సతీసమేతుఁ డై. 45

ఉ. బాలు గుణాలవాలు గురుపాదరజస్తిలకాంకితోల్లస
త్ఫాలుఁ గరాంగుళీయకవితానమణిస్థగితోరు పుస్తకో
చ్చాలితకాంతిజాలుఁ బదసంహితవాక్స్వరరూఢసంచర
త్తాలు సభక్తినమ్రభుజదండవిశాలు సుశీలు జూచుచున్. 46

ఉ. గ్రుచ్చి కవుంగిలించుకొని కూరిమిఁ బుత్రవిశేషభావనం
బచ్చుపడంగ భూరమణుఁడంకతలంబునఁ బెట్టుకొంచుఁ దా
ముచ్చట దీఱ ముద్దుమొగముం దనమోమునఁ జేర్చికొంచు వా
క్రుచ్చ వశంబు గానిపరమోన్నతదివ్యసుఖానుభావుఁ డై. 47

శా. ఆనందాశ్రుజలావగాహితనుఁ డై యన్నా! కుమారావతం
సా! నిన్నున్ బెనుపంగ మామకలసత్సామ్రాజ్యభోగంబులన్
నేనిన్ నిల్పుకొనంగఁ గంటిని భవన్నతిప్రశంసోక్తి నే
దైనన్ శ్లోకముదాహరించి తగ వాక్యార్థంబు గావింప నే? 48

మ. అనుచుం దేశికు నున్నతాసనమునం దాసీనుఁ గాఁ జేసినన్
వినయం బొప్పఁగ నీ వఖండవిలసద్విద్యావిలాసంబునన్
జనపాలోత్తముఁ బ్రీతిఁ జేయు మనుచున్ శాసింపఁ గా శిష్యుఁ డా
య్యాన హస్తాంబుజముల్ మొగిడ్చి నిలచె న్నాస్థానసీమావనిన్. 49

తే. దేవ! నీదివ్యవిగ్రహదినకరాప్తిఁ
బొదలుమద్గుణమానసాంబోజతుంది
లద్విరేఫుఁడ నగుచుఁ గళామరంద
బిందుసందోహలహరి నేఁ బీల్చినాఁడ. 50

వ॥ మఱియును భవదీయపోషణగురుకటాక్షవీక్షణావశంబున ననవరత
ప్రవర్ధమానుండను సకలవిద్యావిచక్షణుండను నైతి గ్రాహ్యంబులగు
వేదవేదాంగాద్యఖిలగ్రంథంబులందు నుపాదేయంబగుపదార్థంబు పరిశీ
లించితి. వేదంబులు యజనాదికంబు లగుఫలావసానశీర్యంబు లైన

కార్యంబుల విధివాచకంబులు గా నిరూపింపబడియును నుపనిషద్వాక్యంబులవలనఁ బరిత్యాగఫలరూపంబు లై యర్థానర్థవాదంబు లగుచు శైష్యభూతంబు లగు బరఁగువేదాంగంబులు వాక్యార్థవివాదానుమోదితంబు లై కనకవసనాద్యలంకారవికసనంబు దేహంబునకుం గాని దేహికిం దేజోభూషణంబులు గానివిధంబునఁ బరోక్షానుభవసంతోషకరంబు లై శబ్దార్థకల్పనాయోగ్యంబు లగు బరఁగుపురాణేతిహాసాద్యనేకసంహితాఖ్యానసామాజకంబులాచారమతసిద్ధాంత వ్యవహారికాద్యపరిమితభేదాపాదితంబు లై యైకమత్యంబు లేక తత్తజ్జనానుకూలభాజనంబు లై మతాభిమానభూతంబు లగు బరఁగునవేకనామరూపంబులుం గలహరిహరదివాకరాంబికాంజనేయగణాపత్యాత్మకంబు లగుమాంత్రికంబులు సగుణపరతంత్రంబు లై యుపాసనాసంశీల్యంబు లై పటాచ్ఛాదితం బగురత్నంబునుంబోలె విస్పష్టంబుసేయక స్వప్రకాశుండును సనాతనుండును సర్వభూతాత్మకుం డగుపరమాత్మను శాస్త్రజన్యజ్ఞానం బనువిషమమార్గంబున నతివైచిత్ర్యకల్పనం బొనర్చుటంజేసి చిద్విలాసంబు లగు బరఁగు నింతకుఁ బరమగురుకటాక్షవీక్షణానిలవశంబునం గాని యహంకర్తృత్వభోక్తృత్వాద్యభిమానమాయామేఘతిరోహితుం డగునమోఘపరబ్రహ్మభానుండు గానం బడఁ డట్టిగురువు దొరకుట దుర్లభంబు. దేశికానుగ్రహంబునం గాని కేవలాధ్యయనమాత్రంబునఁ గార్యంబు లేదు. వారలు మీయట్టికల్యాణగుణభాజనులగురాజులచేతం బూజితం బగుపుణ్యదేశంబులఁ గొచిద్ధ్యానంబునం బ్రకాశించెద రదియునుం గాక విశ్వకర్త యగునీశ్వరునిముఖబాహూరుచరణంబులు జన్మస్థానంబు లైనబ్రహ్మక్షత్రవిట్శూద్రవర్ణంబులకుఁ దపోయజ్ఞదానక్షాత్రకృషివాణిజ్యభక్తిశిద్ధాదికర్మంబులు నిర్ణీతంబు లై యున్నయవి, యేతద్విధపరివర్తకు లయ్యును సకలభూతంబులకు

జ్ఞేయపదార్థం బొక్కటియే యై యున్నయది. కర్మవ్యతిరేకంబు గా కుండ. సకలవర్ణంబుల నిజతేజోవ్యాప్తిచేత వెలుంగం జేయురాజు గల భూమండలంబు రాజన్వతి యనం బరగు; పరమేశ్వరప్రతిపాదకంబు లైనసమ్రాడ్విరాట్ఛబ్దంబులు రాజునకు వేదమ్ములు స్తుతిపరాయణమ్ము లగుటం జేసి భూపాలుండు సర్వోత్తముం డనం బరంగు నని యనేక విధంబుల నతని స్తుతియించి మఱియు నిట్లనియె. 51

ఉ. నీవ విధాత వింద్రశమనేందుధరాచ్యుతభానుసోములున్
నీవ ధనేశవాయువరుణేశులు నీవ యశేషదైవముల్
నీవ సమస్తభూమియును నీపృథుబాహుయుగాధిరూఢసం
భావిత మై వెలుంగు ననపాయని యై రవివంశశేఖరా! 52

వ॥ ఏతద్విషయం బైనయితిహాసంబు గల దాకర్ణింపుము. 53

కం. పుత్రిప్రియుండ నై నిను
స్తోత్రము జేసినది గాదు సుశ్లోకుండౌ న
య్యత్రిమహాముని వైన్యధ
రిత్రీవిభు నిట్లు పలుకరేచినయల్కన్. 54

మ. వినుచుం గౌతముం డత్రితో మనుజు నీ వి ట్లాడంగా ధర్మవే!
ఘనదారిద్ర్యముచే నలంగి ధనకాంక్షం బ్రేలెదీ విట్లు నీ
వనగా నిందురుండు చంద్రుం డీశముఖదేవాధిక్యుం డౌనెర్చునే?
జనులం దేవులం బోలె స్తోత్రమొనరించన్ రాదు వె య్యేటికిన్.

వ॥ అని యిట్లు యిద్దరు మహావాదంబుం జేసిన సభాసదులు వారల నివారించి రాజానుమతంబునం ధర్మవిచక్షణుం డగుసనత్కుమారుపా లికి వారలం దోడ్కొని చని యత్రిగౌతములవివాదం బెఱింగించిన నతండు మధ్యవర్తి యై విచారించి యత్రివాక్యంబులు సర్వజనసామా న్యంబు లనియును నత్రిపక్షంబు సిద్ధాంతంబు జేసె నిక్కథ పంచమ

వేదం బయినభారతంబున వినంబడుఁ గావున మదీయవాక్యంబు లాదరణీయంబు లని మఱియును యుక్తియుక్తంబు లగు వాక్యంబు లుపన్యసించు చున్నయక్కుమారు దిగ్గన డగ్గఱం దిగిచి కొని మూర్ధాఘ్రాణంబు జేసి పరమానందభరితుండై గురువరుం గనుంగొని. 56

శా. స్వామీ! మీరు వచస్పతిప్రతిము లంచత్పూరికారుణ్యవా
క్స్వామీచీనుల రిక్కుమారు మదభీష్టం బెల్ల సిద్ధింప వి
ద్యామాధుర్యరసగ్రహానుభవసంధానాత్ముఁ గాఁ జేసి నా
రే మీ కెట్లు ఋణంబు దీర్ప నగు నుత్కృష్టప్రభావోదయా! 57

ఉ. మీసరివారు మాకెవ రమేయగుణాకరు లీరకారె వి
శ్వాసపదంబు మీహృదయసంశ్రియ మంచు మృదూక్తిభక్తివి
న్యాసము లోడ నమ్రుఁ డయి యాగురిని స్వనకాభిషిక్తునిం
జేసి కృతార్థజన్మఫలసిద్ధుఁడ నైతి నటంచుఁ బల్కుచుణ్. 58

తే. వారి నిద్దఱ వీడ్కొల్పి వసుమతీశుఁ
డుండె వారును గౌతుకాఖండు లగుచు
జని నిజాగారముల నుండి రనఘమతులు
సజ్జనామోదభరితసంచారు లగుచు. 59

వ॥ ఇట్లు సుఖం బున్నకొంతకాలంబునకు నద్ధరామరకుమారుం డంతర్గతంబున. 60

క. జననీజనకులుపోయిరి
జనవిభుఁ డొక్కరుఁడు దక్క సౌహృదభావం
బున నీవార మనఁగ లే
కను మంటిని నొంటిఁ బూర్వకర్మవశమునణ్. 61

వ॥ అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభ మితిన్యాయంబున

దీనికి వగవం బని లే దైనను మజ్జనకుండు సకలభూమండలసంచారా భిలాషుం డై వచ్చి యిచ్చట నంతిరాయదశాసంప్రాప్తుం డయ్యె, నాత్మానై పుత్రనామాసి యనుశ్రుత్యర్థంబు సాంగంబు జేయ కునికి నా కుచితంబు గా దని నిశ్చయించి యొక్కనాఁ డయ్యింద్రద్యుమ్న రాజేంద్రుకడకుం బోయి యతం డభ్యంతరమందిరంబున సతీసమేతుం డయి యున్నయెడఁ బొడసూపిన వారును నతిప్రీతిగౌరవంబుల నాద రించుటయుఁ బ్రాంజలియగుచు వారలతో ని ట్లనియె. 62

చ. నృపవర! సాధువాఁ డగును నిక్కముగాఁ బిత మీర లోజనా
ధిప! వినుఁ డస్మదీయపితృదేవసముం ల్బనదీయసత్కృపా
విపులవిలోకనాస్తి జనవిశ్రుతి నొందితి నిప్పు డొక్కని
న్నప మొనరింతు దాని సుగుణాభరణా! దయచేయఁగాఁ దగున్.

వ॥ అది యెయ్యది యంటి రేని వినుండు మీయనుగ్రహంబున సకలభోగభాగధేయుండ నై యుష్మదౌరసపుత్రులకంటె నధికప్రేమాస్పదీభూతుండ నై యున్నవాఁడ నేమిటఁ గొఱంత లేదు. జగత్పోషణధౌరేయు లగుమీకుఁ బారావారంబునకు నివాసదేశంబునుంబోలె మదీయం బగుసంరక్షణభారంబు లెక్కలోనిది గా దని వేఱ చెప్ప నేల యది యట్లుండెఁ బురుషునకు సర్వోపకారజీవన ముత్తమధర్మంబు గా దని పెద్దలవలన వినంబడు నదియునుం గాక మజ్జనకుండు పరమబ్రహ్మణ్యగణ్యుం డై నబ్రహ్మనామధేయుండు సకలభువనసంచారాపేక్షుం డై వచ్చి యిచ్చట విఫలమనోరథుం డై లోకాంతరగమనుం డయ్యె నని వింటేఁ దత్తేజోభరితుండ నగునావలన నమ్మహానుభావుని యభిప్రాయంబు సఫలంబుఁ జేయించుట మత్సంరక్షకు లగుమీకుఁ గర్తవ్యం బని తోఁచు చున్నయది. భవదధీనుండఁ గావునఁ జిత్తానుసారంబునఁ బోవం గలవాఁడ నని ప్రార్థించిన వార లతని కిట్లనిరి. 64

క. నాయన! నీ కిట్లనఁ దగు
నా యనవరతప్రమోదనటనా యను-చో
నాయనసతి జనవలద
న్నాయన విని యతఁడు గడుభయాత్మం డగుచున్. 65

తే. మిమ్ము నిటువంటివలవంత మెలఁగఁ జేసి
యేను బోయెడివాఁడను గాను శంక
వలవ దుడుగుఁడు మీయాజ్ఞ వలచినపుడ
గుర్తుకొని పోదుఁ బో కున్నఁ గొదువ యేమి. 66

వ. అని యనేకవిధంబుల వారల నూరార్చిన వారును బరేంగితజ్ఞాన విచక్షణులు గావున నతనిభావగర్భితంబు లగువాక్యంబులకుఁ బ్రహృష్టమానసు లగుచు నితనివలన భూలోకసకలవైచిత్ర్యంబులు చూచువారము గా కేమి యని నిశ్చయింపుచు నెట్టకేలకు ననుమతించి శీఘ్రకాలంబునన పునర్విలోకనపరమానందులం జేయు మని భూసురరాజనందనున కాన తిచ్చిన నతండును నట్లు సేయుదు నని భూమండలపుణ్యానదీప్రదక్షిణాభిప్రాయసూచకంబుగా వారికిం బ్రదక్షిణంబు చేసి వజ్రికవచాదిసంరక్షణవ్యాజంబు లగునాలింగనాద్యుపచారంబుల సంభావితుం డై వారల వీడ్కొని చని 67

క. గురువరునకుఁ దనభూసం
చరణం బెఱిఁగింప నతఁడు సంచలితాంతః
కరణుం డగుటయు నాతని
చరణంబుల కెఱఁగి వినయసంపన్నుం డై. 68

వ. భట్టరా! మీర లిప్పట్టున మదీప్సితంబు చేపట్టి సఫలంబు సేయవలయుఁ బట్టికిఁ బుట్టినసంకల్పం బెట్టి దయినను వికల్పంబు గా కుండం గట్టి పఱచి తుదముట్టం జేయుటకు నైనభారంబు గురువులవలన నిర్వ

హింపంబడినవిధంబున నితరులచేత సంవిధానసమాధానంబు గానేర్చ నే యది గావున భవదాజ్ఞావచనంబులు శిరంబున నిడికొని నిర్భయ స్వాంతుండ నై పోయి వచ్చెద నని యనేకవిధంబులం బ్రార్థింపుచుం బునఃపునరభివందనంబు లొనరించిన నగ్గురుండును బరిముదితుం డై దీర్ఘాయుష్మాన్ భవేతిసర్వదాదిగ్విజయోస్తిత్యాద్యనేకవిధాశీర్వచనం బులు జేసి గాఢాలింగనంబునుం గావించి పొమ్ము రమ్మని వీడ్కొల్పిన నతండును గురుకటాక్షవీక్షణాశ్రీధారాభిషేకంబున మృదుమధురవచ నామృతోపాదానావిచ్ఛిన్నపాథేయుం డై ప్రాగ్దిశాభిముఖుం డగుచుం బురంబు వెలువడి పోవం బోవ. 69

మ. అటం గాంచె న్శుభసూచకంబులు మనోహ్లాదానుసంధాయితో
త్కటమందానిలమున్ సుధాకరమయూఖాళీలసద్వక్త్రవి
స్ఫుటసంభాషితకృష్ణనామవిహగేశున్ న్నభరద్వాజప
ర్యటనంబు న్సరయూతరంగకణకహ్లారప్రవాహంబులన్. 70

చ. శకునము లిట్లు కన్గొని విశంకమతిన్ ధరణీసురుండు మా
మకతనురక్షణంబును సమంచితదైవకృపాతిరేకమున్
బ్రకటమహాజనాదరణభావము సర్వవిశేషకార్య మ
త్యకుటిలవృత్తిఁ జేయుటయుఁ దప్పదు నా కని నిశ్చితాత్ముఁ డై.

మ. ఖగనాథుం డమృతార్థ మై దివికి నేకాంగుండు నై పోవున
ట్లు, గుణాగ్రేసరుఁ డంజనీసుతుఁడు సుశ్లోకుండు సంజీవనీ
నగముం దేరఁగ బోవున ట్లరిగె భూనాథోల్లసద్భవ్యవా
క్యగుఁ డై సద్విజభూమరుత్సుతసమాఖ్యల్ సార్థకంబై తగన్.

వ. ఇట్లు భావిశుభలాంఛనంబులు సూచించు మృగలాంఛనుండునుం బోలె సకలజనాభిగమ్యమానుం డగుచుం దత్పురోవనంబు సొచ్చ నప్పు డచ్చటిజనంబు లచ్చెరువుతోడం దారు ము న్నొక్కమారు

రాజసన్నిధానంబునఁ బుత్రినిధానంబుగాఁ జూచినవారు గావున భయ సంభ్రమోద్వేగానురాగంబులతో నుభయభాగంబులం గొలిచి రా నతండును వారలం గరుణావిలోకనంబుల వీడ్కొలుపుచుం బోవునద్ధ రాదేవునిం గనుంగొని యితండు పత్యతుకవసంతుం డనుచుఁ బ్రహ్లా ష్టస్వాంతుఁ డై గారుణ్యమణిప్రభాచ్ఛాదితచూతతరుణశాఖానిర్మితతోర ణానుకూలంబు లగుశుకమాలికాజాలంబులయు వందిమాగధస్తోత్రపఠ నానుభావంబు లగుపారావతశారికాదివిహగగంభీరరావంబులయుఁ జీని చీనాంబరాభరణాభిరూప్యరూపాజీవికావినోదనటనాభినయానుకారం బు లగుమత్తోన్మత్తమయూరీనృత్తప్రచారంబులయు మందరమధ్యమ స్వరతానగానాంచితచంచరీకసంచయతంత్రీభూతవిపంచికోదంచితపంచ మస్వరప్రపంచీకరణకోకిలకలాలాపంబులయు, లాజీకరణభూజశాఖాగ్ర పవమానప్రకంపమానకుసుమసమూహంబులయు ఛత్రీకృతచ్ఛాయా వృక్షంబులయుఁ జామరీకృతచమరీమృగవాలంబులయు, పక్షిజనాయ మానకాతరవిలోకనాతిమనోహారహరిణీసముదాయంబులయు నీరాజనీ కృతపల్లవితకింశుకాశోకానోకహకోరకంబులయు, నాఘ్రాయమాన కుందకుటజకురవకదమందారసుగంధికాదివివిధపుష్పనికరంబులయుఁ బా ద్యపరిద్యోతమానమరందసందోహంబులయుఁ దోహందత్తద్వివిధసహ జసంచారంబులు పరిభుదర్శనసమయోచితంబులుగా నాపాదింపుచు మందపవనాద్యుపచారంబు లొనర్చునవ్వనదేవతాశిరోమణిం గనుం గొని తద్విలాసంబుల కమందానందంబున బొదలుచు ననతిదూరంబున సరయూనదీప్రవాహోదకశీకరసిక్తసర్వర్తుకుసుమశాఖాఫలభరితంబును సహకారజంబుజంబీరకదంబకదళీకపిత్థకాంచనపనసనాగపున్నాగదాడి మామలకామ్రసరళతమాలశింశుపశోకాగురుమందారచందనమాధవీప్ర వాళప్రముఖభూమిరుహవితానాభిరామంబును నగునయ్యారామంబు

దరియం బోయి యోజనత్రియాయామం బయ్యును గోత్రశత్రయమా త్రింబునుంబోలె నశ్రమంబున నిర్గమించుచు మధ్యాహ్నంబునకుఁ దీరంబు చేరం బోయి దత్సమీపంబున భూసురోత్తముం డున్నసమయంబున, 73

మ. సరసీజాస్యము నుత్పలాక్షియుగముక్ శైవాలకేశాళి భం
గరభాంగత్రివళీకుచంబు లొగి భృంగావర్తరూపేక్షితో
త్కరముక్ నాభితలంబు సైకతకటిస్థానంబు డిండీరహా
సరుచిం బొల్పగునానదీసతి మహాసౌహార్ద మొప్పంగ నా
సరసుం జూడఁగఁ బిల్చె నా నెగడె హంసకారంచనాదార్భటుల్. 74

ఉ. ఈపగిది న్నదీస్ఫురదహీనరసామృతమాధురీఝరీ
వ్యాపక మాదిగాఁ గలుగువైభవ మెల్లను జూచి చూచి, యో
పాపవిదారి! యోపరమపావని! యంచు నమస్కరించి యు
ద్దాపృథివీసురుండు వినయంబున నందుఁ గృతావగాహుఁడై. 75

క. మఱి సంధ్యావందనమును
సురమునిపితృతర్పణంబు సురుచిరమంత్ర
స్ఫురణోచ్చారణవిధితో
ధరణీసురుఁ డపు డొనర్చెఁ దద్దయుభక్తిన్. 76

వ. ఇవ్విధంబున నాహ్నికకృత్యంబు లాచరించి మాధుర్యోపేతంబు లగుఫలంబులను సరయూనదీపవిత్రజలంబులను, క్షుత్పిపాసానివృత్తుండై తత్తీరకుటజకుంజలతాపుంజమంజులచ్ఛాయాప్రదేశంబున నివసించి యుండె నంత, 77

క. తనసుతుఁ డింద్రద్యుమ్నుఁడు
ఘనతరమోహాబ్ధి మునుఁగఁ గన్గొని రాగం
బున వనట నొంది పశ్చిమ
వనధిని చా మునిఁగె ననఁగ వార్తెలె నినుండున్. 78

సీ. తాండవాడంబరత్ర్యంబకాంబరజటా
పటలీకృతోల్లసత్ప్రభ లనంగ
జరమాద్రిశిఖరసంచరితసన్మునిజనా
చ్ఛాదితారుణధాతుశాటు లనఁగఁ
దరుణసంధ్యాకాలదర్శితాస్తాచల
జ్యోతిర్లతాద్యుతిస్తోమ మనఁగ
భానుబింబోత్పాతపటువేగనిర్గతాం
భోధిబాడబశిఖాపూర మనఁగ
తే. నస్తమయసమయార్కమహారిభుజాంత
రాళసముదగ్రశోభావిరాజమాన
కౌస్తుభోద్దీర్ణపరిపూర్ణకళ లనంగ
నపరదిశ నొప్పె సంధ్యారుణాతపములు. 79

వ. అంత 80

సీ. భానువియోగార్తిఁ బద్మిని ముకుళింపఁ
గడ లంటి తిరుగుభృంగాళి యనఁగ
బతిఁ గానమిని దివాసతి యధోముఖవృత్తి
చేవలి ముసుఁగు గా విడిచె ననఁగ
సంజచోరుఁడు లోకసంశయాస్పదముగా
మైపూఁతఁ బూసినమసి యనంగ
మహి యరాజక మైన మానవులందఱు
దుర్ణయు లై సేయుదురిత మనఁగఁ
తే. గొంచె మయ్యును మఱి దానిఁ గొంచెపఱచి
గాఢ మయ్యును బదపడి బాధ మగుచు
నతులితాఖండభూమండలాభిభూత
ఘోర మై యొప్పె గాఢాంధకార మపుడు. 81

వ. తదనంతరం బ 82

చ. హరిపదవీథియందు ధవళాంశుపరిస్ఫుటతారకాళి త
చ్చరణనఖంబులో యన నిశాసతి చందురురాక గోరి వి
స్ఫురదసితాంబరాంబరవిభూషిత యైనపటాంతరాంతర్గో
త్కరకృతకుందచిత్రకలికావళి నా విలసిల్లె నెంతయున్. 83

క. రాజునకు ముందు జనుభట
రాజి యనం దారకాళి రాజిలె దెసలన్
భూజానికింకరాళికి
నైజమనఃతత్రికాఖ్యనదిహేతువుగాన్. 84

సీ. లక్ష్మీసహైకవిలక్షణాభ్యుదయుండు
పరసతీముఖపద్మపరిహరుండు
సకలకళాశాలి సత్పథసంచారి
పరచక్రభేదనోద్భాయకరుండు
గాఢతమోదారి ఘనయశశ్చంద్రికా
ధవళీకృతాజాండతలవిహారి
బుధమనస్సంతోషపూరితోదారుండు
జారచోరమనోవిచారకరుండు

తే. భూరిపరితాపదీనచకోరచంద్రు
డవిరళామోదకలితసత్కువలయుండు
రాజు వెంచేసెఁ బ్రాగ్దిశారత్నఖచిత
హేమసింహాసనాస్థానసీమ కపుడు. 85

వ. మఱియు నిట్లపరిమితశోభావిరాజమానవతరుణకిరణపటలాక్రాంత
భూనభోంతరదిగంతరుం డగుచయ్యామినీకాంతుండు నిశాంగనానంగ
మస్వాంతుం డై తదీయాననంబునకు నుపమానభూతం బగునిజబింబం

బును నయనకుముదంబులకుఁ గుముదబంధువాచకంబును జంచలదృ
గ్వితానంబునకు నిజలాంఛనహారిణీ సముదంచితవిలోకనోపాయం
బును సుస్నిగ్ధకపోలఫలకంబులకు సుధాకిరణలేఖనంబును దారహారం
బులకుఁ దారాధిపతిత్వప్రదర్శనంబు వినీలకోమలనీలరాజికి నిజకళం
కాంగసంకేలంబును నిమ్ననాభీవల్మీకంబునకు నిజలాంఛనశశనివేశన
సౌమనస్యంబును నీలాంబరాంతరితపీనపయోధరంబులకుఁ బయోధర
మార్గసంచరణవిధానకౌశలంబును లావణ్యసరసగర్భితజంఘికాకలమగ
ర్భంబులకు నోషధిపతిత్వోద్దీపనంబును రమణీయోరుభాగసమానకర్వా
రకదళికాస్తంభంబులకుఁ దదీయనామసంవహనసమాధానంబును నిరవ
కాశావలగ్నంబునకు నాకాశసంచారిత్వంబును జరణకిసలయంబులకు
మయూఖామృతసేచనంబును బ్రకటించుచు నైకమత్యదాంపత్యంబు
నెరపుచుఁ దత్తత్కళానుసంధానంబునకుఁ గళానిధి యై సమాలింగన
సంస్పర్శనసంవహనసముద్దీపనాదికంబుల వెలయించుచుఁ జంద్రికాధౌత
పటాచ్ఛాదితనేపథ్యంబున నిశాచంద్రమిథునంబు ప్రత్యక్షతారకబ్ర
హ్మమయం బై నమహానందంబునం బొదలుచు సకలజంతుజాలంబు
లకుఁ దన్మయత్వసిద్ధిం బ్రసాదించుచుఁ జరాచరప్రపంచం బంతేయు
నఖండస్వచ్ఛపదార్థ సామాన్యాధికరణంబుగా వెలింగించు చుండె
నంత. 86

క. తరణిశిశుప్రసవార్తిం
బరగఁనప్రాక్సతికి దేవభామ లిడుమను
స్వరయుతమంత్రవిభూతుల
కరణి ఖగరుతము ధవళకాంతియుఁ దోఁచెన్. 87

సీ. మందేహరాక్షసమారణకర్మకృ
ద్గురుసురార్చితహోమకుండ మనఁగఁ

ప్రాకశాశసనసౌధభాగాగ్రసన్మణి
కుంభితోజ్జ్వలహేమకుంభ మనఁగ
ఘనతమోనిర్మగ్నజనవిలోకనదీప్తి
కమరు తత్త్రినదీపకళ యనంగఁ
గుముదినీసంతోషఘోరవారాశిసం
హరణకార్యోద్భవానౌర్వాగ్ని యనఁగఁ
గర్మసముదాయసాక్షిత్వకౌశలంబు
పద్మినీపూర్వసుకృతతపఃఫలంబు
కోకమిథునానురాగ మస్తోకతేజ
మున నవతరించె నుదయాద్రి వనజహితుఁడు. 88

వ. మఱియు నివ్విధంబున సూర్యోదయం బగుటయు నద్ధరామరుండు స్నానసంధ్యావందనాదికాల్యకరణీయంబులు దీర్చి దేవర్షిపితృతర్పణంబులు నిర్వర్తించుచు సంసారసాగరోత్తరణసాధనం బగుసరయూనది నుత్తరించి యామద్వయంబునకు సన్నిహితం బైనచోట నివసించుచు సంభవత్పదార్థంబులం దృప్తుం డై తద్దినశేషం బచ్చటం గడపుచు నిట్లు కతిపయప్రయాణంబుల నందాసరస్వతీగోమతీకాళిందీప్రముఖ పుణ్యక్షేత్రంబులు సేవించుచు నంగవంగకళింగమగధమాళవపౌండ్ర విధేహపాంచాలచేదిమత్స్యాదిదేశంబులను దద్దేశాధిపతులను జనపదంబులను దత్రజ్జనసంచారంబులను నారామగిరిగహ్వరాదిదుర్గమస్థలంబులను బ్రాక్సముద్రముద్రితధరావలయం బంతయుం జూచి సప్తమాసంబులకు మరలి శమనావతీపురంబున కరిగి రాజమందిరద్వారంబు చేరం జనుసమయంబున దౌవారికు లతనిం బొడగని సంభ్రమంబున నయ్యింద్రద్యుమ్నరాజేంద్రున కెఱింగించిన నతం డత్యానందంబునం బొదలుచు దేవీసహితంబుగా నెదుర్కొని యతనిం గాంచి గాఢాలింగ

నాదికంబులం గృతార్థుం డగుచు నెత్తికొని సభాస్థానంబునకు వచ్చి సింహాసనాసీనుం డై యంకతలంబున నిడికొని యమందానందబాష్పోదకంబుల నతని నభిషేకించుచున్నయారాజశేఖరున కవనీసురకుమారశేఖరుం డతివినయంబుతో నిలువంబడి ప్రాంజలి యగుచు నతిమధురగంభీరప్వసంబున నిట్లనియె. 89

ఉ. దేవర పంపఁగాఁ జని యతిస్థిరధైర్యముతోడఁ బూర్వది
గ్భూవలయంబుఁ జూచితి నపూర్వమనోహరభోగభాగ్యశో
భావహ మౌచు సర్వజనభవ్యగుణాశ్రియ మౌచు ధర్మదీ
ప్తావళ మౌచు నొప్పెడి సఖండభవద్భుజశాసనోన్నతిన్. 90

మత్తకోకిల.

భూమి చాలఁగఁ జూచితి న్నిను భూపతీంద్ర! మహాగుణో
ద్దామ నీసము నెందుఁ గానము తారకావళు లెన్నియు
న్సోముఁడుం దగ నేమి సేయును సూర్యుముందట దీపికా
స్తోమ మేమి యొనర్చు భూరియశోఖిలావనిభూషణా. 91

క. మఱియును బెక్కువిధంబుల
ధరణిపుఁ గొనియాడ నతఁడు తద్దయుఁ గరుణా
దరభరితుం డగుటయు భూ
సురశేఖరుఁ డిట్టు లనియె సురుచిరభక్తిన్. 92

సీ. రాజేంద్ర! దక్షిణరాజ్యంబుఁ జూడంగ
నభిలాష మొదవె మీ రనుమతింపఁ
బోయి వచ్చెద నన భూవరుఁ డిట్లను
నిన్నుఁ గానక యున్న! నిలువ లేము
నీయభిప్రాయంబు నిగ్రహింపఁగ లేము
ముదముతో నొకటి చెప్పెదను వినుము

గూఢవృత్తిఁ బ్రజలగుణ మరయుట మాకు
విహితంబు గావున విమలబుద్ధి
మత్ప్రీతినిధానముగ ధరామండలమున
నరు లొనర్చెడిమర్యాదసరణు లెల్ల
మహిమతోఁ జూచి రావయ్య మానసీయ
వరగుణసమాజ! భూవియచ్చరబిడౌజ. 93

మ. అని రాజన్యవరుండు పల్కుటయు నత్యానందముం బొందుచుం
జని నారాయణపండితాఖ్యునకు సాష్టాంగంబు గావించినం
గని యాతండు సుతప్రమోదకలనాకారుణ్యతం జూచినం
దనవృత్తాంతము సర్వముం దెలిపె సద్భక్తిస్ఫురత్ప్రోషిమర్. 94

వ. ఇట్లగ్గురుండు దనశిష్యవరుచేతం బాృగ్దేశవిలోకితం బగుజనలోక పర్యటనంబును దక్షిణభాగంబుఁ జూచుటకు రాజుచేత ననుజ్ఞాతుం డగుటయు విని సంతోషించుచు శిష్యుం గ్రనుంగొని నీవు నిర్విఘ్నపరిసమాప్తంబుగా సకలలోకసంచారంబును నిర్వర్తింపంగలవాఁడవు పోయి రమ్మనిసఁ బునఃపునఃప్రణామంబులు గావించుచు నాఁటిదినం బతనిసన్నిధి నిష్టగోష్ఠిం బ్రవర్తించుచు రేపకడన కదలి బాల్యంబునం దన్ను సంరక్షించినబ్రాహ్మణు నతనిభార్యను జననీజనకప్రియాభిప్రాయం బునం గని పాదాభివందనాదిసంవిధానంబులఁ బ్రీతులం జేయుచు వారలయనుజ్ఞ వడసి ప్రయాణోన్ముఖుం డై చను చున్నసమయం బున 95

చ. సురుచిరహేమకాంతిపరిశోభితపూర్ణఘటంబు లంద మై
గురుభుజపీఠి నాత్మకుచకుంభసమానముఁ దెల్పుకై వడిన్
వఱలుచు నుండ నిద్దఱు సువాసిను లప్డు డెదుర్కొనన్ ధరా
మరవరుఁ డెంతయు న్మదిన మెచ్చ్య న తించును సంతసించుచున్

మ. జనుచుండంగ నిశాకరోపలమహాసౌధాగ్రభాగంబులన్
వనితారత్నము లాత్మకాంతికలికాస్వచ్ఛప్రభాజాలముల్
వినియుక్తంబుగఁ జేయుచున్ మృదులవాగ్విన్యాసవైచిత్రి ని
ట్లనుచున్ బల్కి రహోబతేతివచనాహ్వానక్రియాధుర్య లై. 97

సీ. జననీజనకు లిట్టితనయువిలాసంబుఁ
గన లేమి బహుపాప మనెడివార
లీగుణాకరుఁ బుత్రభాగధేయుని గాఁగఁ
బెంచినరాజు మన్నించువారు
నిఖిలగుణోదారు నిట్టికుమారుని
నెన్నఁడుఁ జూడ లే దనెడువారు
ప్రాగ్దేశ మొక్కఁడుఁ బ్రొద్దిడితోఁ బోయి వ
చ్చినమహాపుణ్యాత్ముఁ డనెడివారు
సకలవిద్యావిశారదుం డకుటిలప్ర
భావుఁ డభినవభావసంభవుఁడు వీని
కవనిసలిలాదిభూతముల్ కరుణసేయుఁ
గాత మనువార లైరి కంజాతముఖులు. 98

వ. ఇవ్విధంబున పౌరజనంబు లనేకవిధంబులం గొనియాడు చుండం గనుంగొనుచు వారలయాశీర్వాదంబు లాదరించుచుఁ దత్పురోపవనంబున సకలఋతుకుసుమఫలభరితశాఖిశాఖాగ్రమనోహరస్వరవిరాజమానశుకపికశారికాదివిహగకలకలకోలాహలంబులును హంసక్రౌంచకారండవకోయష్టికాధిష్ఠితకులాయకులకులారావఘుమంఘుమితకులానోకహాసంకులసరోవరసముత్కరకమలేందీవరమరందపానమత్తమధుకరాంగీకార్థసంగీతంబుల నాలకించుచుసరయూనది నుత్తరించి క్రమక్రమాగతాయాసప్రయాణంబుల గోర్చుచు నర్మదావేత్రవతీవేదవతీంద్ర

వత్యాదిమహానదులును మాహిష్మత్యమరావత్యాదిమహాపట్టణంబులును శశకపుళిందనిషధకు కురుకేరళపుండ్రశూరసేనయవనకరహాటాది దేశంబులఁ దత్తత్ప్రజాజనసమాచారంబులును బరిశీలించుచు మాస దశకంబునకు మరలి నిజపురంబున కరిగి రాజమందిరంబుఁ జేరి ప్రభు దర్శనంబును గావించిన వారునుం బరమానందంబునం బొదలుచు బహువిధంబులం బ్రేమానురాగంబులు నెరపుచుండం గొలిచి యుండి యారాజన్యచంద్రున కతం డిట్లనియె. 99

ఉ. దక్షిణదేశమందువివిధాధ్వరకర్తలు రాజు లెల్లఁ బ్రి
త్యక్షసరోజసంభవు లిలామరు లెల్ల వణిగ్జనంబు లా
యక్షపతిప్రభావు లనయంబు సమగ్రసపర్య శేముషీ
దీక్షితు లంఘ్రిజోత్తములు దేవ! సమస్తసుఖాస్పదం బగున్. 100

తే. గాని నీవంటిరాజు నెం దేని గాన
మనితరోపమసౌభాగ్యమాననీయ
మహిమ లన్నియు నీయందు సహజ మయ్యెఁ
బరుల కెంతయు నభ్యాసభరము లయ్యె. 101

క. ఆదేశహరిహరాగా
రాధిష్ఠసువర్ణఖచితరత్నప్రభ చే
నాదిత్యాస్తమయోదయ
భేదము లరయంగ వలసెఁ బృథ్వీరమణా. 102

వ. అదియునుం గాక విచిత్రరత్నమణిమయహర్మ్యగోపురప్రాకారప్రాంగణవేదికాభవనప్రదేశంబు లనేకంబులఁ జూచితి సకలభోగభాగ్యసమన్వితం బై యపరిమితధనధాన్యవస్తుసంపద్భరితం బై సర్వసస్యసమృద్ధం బై వేదశాస్త్రాధ్యయనఘోషభూషితాగ్రజన్మాగ్రహారప్రా

గోస్తరం బై జారచోరరుగ్బాధావిరహితం బై యొప్పులకుప్పయి యు
న్నదక్షిణదేశంబునందు 103

సీ. పూని యిందఱిదుష్కృతమూనవేందుఁడ వంటి
దాత లేఁ డనుజనఖ్యాతి వింటి
నీలోకముల కెల్ల నేకాతపత్త్రప్ర
భుం డీవ యనుమాట పొసఁగ వింటి
నిఖిలగతాగతనృపవరోత్తములందు
నిన్నుఁ బోలువారు లే రనఁగ వింటి
ఘనధైర్యగాంభీర్యకరుణాప్రతాపాప్తి
కతని కతిఁ డె సాటి యనఁగ వింటి
నిట్టిభవదీయపోషణాహీనభాజ
నుండ నగుటను గులపావనుండ నై
నిన్ను నుతియింతు ననుట కే నెంతవాఁడ
నఖిలలోకశరణ్య గుణాగ్రగణ్య. 104

వ. అని బహువిధంబుల నారాజసుతాగ్రముని స్తోత్రంబు సేయు
చుండె నంత. 105

ఉ. ఇవ్విధి బల్కుట న్విని మహీపతి భూరిదయార్ద్రచిత్తుఁడై
నివ్వెఱ గంది యుండె ధరణీసురుఁ గౌఁగిటఁ జేర్చుకొంచుఁ దా
నువ్విళులూరుచుం బుధమనోహరుపేర్మిను జూచి సభ్యులం
దెవ్వరు నేమియు న్ననక దిగ్భ్రమ నొందిరి వింజమాకృతిన్. 106

వ. సదస్యు లిత్తెఱంగునం బ్రమోదాయత్తచిత్తు లై యుండి కొంత
సేపునకు, 107

క. ఒకఁడె సుపుత్త్రుఁడు కులదీ
పకుఁ డనుట యధార్థ మయ్యెఁ బరికింపఁగ నీ

యకలంకుఁ డమితతేజో
ధికమూర్తి మహాత్తరుండు ధీయుం డరయన్. 108

క. ఇబ్బాలుం డొక్కఁడుఁ జని
నిబ్బరముగ దూరదేశనీతిపథంబుల్
గొబ్బునఁ గనుఁగొని వచ్చెను
అబ్బుర మిది యంచు సభికు లందఱుఁ బలుకన్. 109

ఉ. నా విని భూసురుండు వినయంబున వారలతోడ ని ట్లనుం
భూవిభునాజ్ఞ మీ దగుపరిపూర్ణకటాక్షబలంబుచేత నే
నీవిధి సల్పినాఁడ నిది నిశ్చయ మింతియ గానఁ బుత్రిసం
భావితు న స్గణించుటలు భావ్యము గా దని విన్నవించెదన్. 110

వ. అని మఱియుఁ బెక్కుభంగుల సభాజనుల స్తుతిభాజనులుగాఁ బ్రతిపాదింపుచుఁ దనయం దతినిందారోపణంబు జేసికొనుచు నిపుణంబుగాఁ బలుకుచున్న నతనిం జూచి పరిమ్ముదితస్వాంతుండై యున్నయద్ధరాకాంతుం గనుంగొని సమయం బని తలంచుచు మహాప్రాజ్ఞుండైన నయ్యజ్ఞనాభిధేయుం డారాజునకు ని ట్లని విన్నవించె. 111

క. పశ్చిమదేశం బదియు వి
పశ్చిజ్జనబహుళ మనెడుప్రతీతివచో
నిశ్చయ మపరోక్షాప్తిని
పశ్చాత్సంతుష్టి గనుట భావ్యము గాదే. 112

ఉ. కాన భవద్దయానుమతి గైకొని వేగమె పోయి వత్తు నా
మానవనాథుఁ డాత్మహితమంత్రిసమాజము జూడ వారునుం
బూనికఁ జేసి రీతనికిఁ బూర్ణమనోరథసిద్ధి గల్గెడున్
మానుప వద్దటం చనిన మంచిది పోదువు గాక చెచ్చెరన్. 113

క. అని పలికినధరణీశుని
మన మురియాడుట యెఱింగి మహనీయయశో

ధను డుండెం బూర్వదక్షిణ
ఘనదేశకథావిశేషకల్పనుఁ దగుచున్. 114

ఉ. కొన్నిదినంబు లుండి నృపకుంజరునాజ్ఞ వహించి బుద్ధిసం
పన్నుఁడు పశ్చిమంబునకుఁ బ్రౌఢిమ నేగుట చూచి పౌరు లీ
పిన్న డోకించు కేని యెద భీతియు లే కిటుపోవు టద్భుతం
బన్నమహారవం బలరె నబ్ధిగభీరనినాదమట్లుగన్. 115

క. ఈవిధమునఁ జనుధరణీ
దేవునకున్ గాన నయ్యె దృఢతరసమ్మదై
రావణసమగజ మతిశో
భావృతఘంటానినాదబహుళం బగుచున్. 116

వ. దివ్యశకునంబు లనేకంబు లవలోకించుచు దృఢీకృతమనోరథుం
డై పౌరజనంబు వీడ్కొనుచుం బోయి పోయి, 117

సీ. కూలంకషానేకఘోరకానమహా
ధ్వాంతదుర్గమ మైనతమస దాఁటి
రుచిరరక్తోపలారుణితప్రవాహసం
శోభితాభిఖ్య యాశోణ గడచి
యతులగంభీరవాసితనిజోదకశీత
సీప్రవాదజనౌఘ శిప్రఁ జూచి
సారసోత్పలలసత్సౌరభ్యసంయుక్త
మందానిలానంద నంద మునిఁగి
విమలవారివిహారి కావేరి చేరి
హంసకారండవాదివిహంగరాజ
మహితకలనాదమధురాయమానకర్ణ
పుష్కరం బైనపుష్కరిఁ బోలఁ గాంచి. 118

వ. మఱియు సేతాద్యశంబు లగుకృష్ణాసరస్వతీవేణీప్రముఖంబు లయి నపుణ్యనదీనివాసంబు లనేకంబులు చూచి కృతావగాహుం డగుచుం దత్తద్దేశసమాశ్రితంబు లగుదేశంబులు 119

సీ. సౌరాష్ట్రబాహ్లీకసౌవీరకేకయ
కురువిదర్భాభీరకోసలాంధ్ర
కైరాతమాళవకర్పటహూణత్రి
గర్తదాశార్ణాదికంబు లైన
పశ్చిమసాగరపర్యంతదేశముల్
దేశాధినాథనిర్దేశములును
సకలజనాచారసంసారభేదముల్
దేవాలయారామదివ్యభూము
లరసి సంతోషనిర్భరితాత్ముం డగుచు
వత్సరములోన ధైర్యసంపత్సమృద్ధి
రాజుఁ గనుఁగొన మరలె విరాజమాన
తేజుఁ డవనీసురప్రవబిడౌజుఁ డపుడు. 120

వ. అంత నిచ్చట నయ్యింద్రద్యుమ్నచంద్రుం డక్కుమారు రాకకు నిరీక్షించుచుఁ బెద్దకాలం బగుటకు విచారగ్రస్తుం డై కార్యేతరపరిహారపరిహారత్వంబునం గుందుచు నాహారనిద్రలు మాని దినంబు యుగప్రమాణంబు గాఁ గడపుచు మఱియు నొక్కనాఁడు సకలజనపరివేష్టితుం డై పేరోలగం బున్నసమయంబున నొక్కభటుం డతిత్వరితగతిం జనుదెంచి దేవా! యిదె బ్రాహ్మణకుమారుం డరుదెంచు చున్నాఁ డనియును, సింహద్వారసమీపంబున నతనిం గని దేవర కెఱింగించుట కై యిట వచ్చితి ననియును విన్నవించిన విని యతిప్రమోదమానసుం డై సభాజనంబులతో ససంభ్రమంబుగా నెదుర్కొని,

ఉ. వచ్చెడువానిఁ జూచి నృపవర్యుఁ డఖండసుఖానుభూతిపెం
పచ్చుపడంగ భూసురకులాగ్రిణు డగ్గఱఁ జేరియాత్మలో
మెచ్చుచుఁ గౌఁగిలించుకొని మేన్పులకాంకుర మందఁ బ్రీతుఁ డై
చెచ్చెఱ వాని నెత్తికొని చేర్చె నిజాసనపీఠి నాదటన్. 122

క. ఈవిధముగఁ జనుదెంచి మ
హావిభవసమగ్రుఁ డగుచు నవనీసురలం
దేవాతిధిదేవుల నా
నావిధదానార్చనముల ననిపెం బెలుచన్. 123

వ. ఇట్లు నిజోత్సాహాపరిమితం బగుమహోత్సవంబు నిర్వర్తించి యా భుక్కుమారుం దేఱి చూచి బాష్పపూరితనయనుం డై గద్గదస్వనంబున నతనితో ని ట్లనియె. 124

ఉ. చిన్నికుమార! యోసుగుణశేఖర! భూసురవంశపావనా!
ని న్నెడబాసి యున్కి కన్ను నిష్ఠుర మయ్యె సహింప లేమి నా
పన్నుఁడ నైతి నయ్య! విను ప్రాణసమాను నినుం బ్రవాస మిం
కెన్నఁడుఁ బంపఁ బంపినను నేనును వచ్చెద నయ్య తోడుగన్ 125

వ. అనిన నయ్యవనీదేవుండు రాజుమనసం బతివ్యాసంగం బగుట భవిష్యదుత్తరగమనంబునకు విముఖత్వంబు సంభవించునో యని చింతావిలమానసుం డగుచుసంభ్రమంబుగా ని ట్లని విన్నవించె. 126

మ. జననాధా! భవదాజ్ఞ గొంచు ధరణీసంచారముం జేయుచో
ఘనకోదండశరాన్వితంబుగను నాకై దండ మీ రెప్పుడున్
జనుచున్నట్లుగఁ దోఁచు దాన నభయుస్వాంతుండ నై బోవుదు
న్వినుఁడీ రిప్పుడువేఱ రా వలయు నే విశ్వంభరాఖండలా! 127

ఉ. నీభుజవప్రగుప్తి, యవనీసురభూరికటాక్షవీక్షణా
ప్రాభవయుక్తి గల్గుట శుభస్థిరవృత్తికి లోప మెన్నఁడున్

స్నీభువనత్రియంబున మహీశ్వర! కల్గు నె మీర లిట్టు హా!
హా! భయ మంను లేరికి మహాద్భుత మై మదిఁ దోఁచ కుండెమన్?

క. అస్తాచలపర్యంతస
మస్తధరాచక్రి మరసి మరలితి లోకం
బస్తోకభవదఖండగు
ణస్తవనోత్సాహభాజనం బై యుండెక్. 129

సీ. సర్వవర్ణాచారసరణిచే వెలుఁగొంది
వేదవేదాంగాదివిద్య లెల్ల
సంతతాధ్యయనార్థసంపాదకంబు లై
స్నానసంధ్యాద్యనుష్ఠానకర్మ
సమితికాలోచితసముపాసితంబు లై
దానంబు లుత్తమాధీనములుగ
ద్రివ్యంబు లెల్లను ద్యాగభోగపరంబు
పరమభక్తియు దైవపరము గాఁగ
సకలభోగభాగ్యసంపత్సమృద్ధిచే
జారచోరభయవిదూర మగుచు
నెగడెఁ బశ్చిమంబు నిద్ధాత్రిలోపల
భవ్యకీర్తిసాంద్ర పార్థివేంద్ర. 130

వ. పూర్వదక్షిణపశ్చిమంబులు క్రమంబున సంచారంబు జేసితి నింక నుత్తరభాగం బవశిష్టం బయి యున్నయది. భవదనుగ్రహంబున నిర్వి చారంబుగా నదియును సమాప్తి యగు మద్విషయంబు దేవర కను మానంబు వలవ దని విన్నవించిన నతనిప్రగల్భవచనంబులు విని నిరు త్తరుం డై కాలయాపనంబు సేయుభావంబున ద్రోచి పుచ్చువాఁ డై గురుదర్శనంబుఁ గావింపు మ్మని గౌరవంబుగా వీడ్కొల్పిన వల్లె యని యతండు తత్క్షణం బ చని, 131

క. గురువరుఁ గని తచ్చరణాం
బురుహంబుల కెఱఁగి వినయభూషణుఁ డగుచున్
కరములు నిటలతటంబునఁ
దిరముగ గదియించి సంస్తుతించెఁ బ్రీతిన్. 132

క. నారాయణపండిత జగ
దారాధితగుణవితాన దైవసమానా!
భూరికృపారసపారా
వార! భవద్దయను మగుడి వచ్చితి నిపుడున్. 133

వ. అని మఱియు ననేకవిధంబుల నుపాధ్యాయునుపాసించుచుఁ బ
శ్చిమదేశవర్తనంబు సవిస్తరంబుగా వివరించుచు పదంబడి పోషక జన
నీజనకులం గని వారల నభివందనాదికంబుల నాదరించుచు నిచ్ఛావి
హారంబులఁ గొన్నిదినంబులు గడపి యుత్తరదేశంబుఁ జూచుటకు
నుద్యోగించుచు నొక్కనాఁడు, 134

క. సచివపురోహితవిబుధ
పరిచయము గొలువంగ రాజు పండితగోష్ఠిన్
రుచిరమతి నున్నఁ జని యతఁ
డచలితుఁ డతిభక్తితోడ ననియెం బ్రీతిన్. 135.

సీ. అనయంబుఁ బితృవియోగార్తు నన్నకుటిల
ప్రేమాతిరేకుఁడై పెనిచె నెవఁడు
కరుణ నుపనయనకర్మంబు గావించి
సకలవిద్యాభ్యాస సంప్రవీణుఁ
జేసి పుత్రాధికస్నేహంబు నెరపుచు
నిఖిలభోగైకనిర్భిదుఁ జేసె
మదభీష్టయుక్తుఁడై మహి యెల్లఁ జూచి ర
మ్మనుచునాజ్ఞ యొసంగి యనిపినాఁడు

తే. భవ్యగుణశాలి సుజనసంభావ్యుఁ డతఁడు
కొఱఁత బడి యున్న యట్టియుత్తరదిశాభి
గమనశాసన మొసఁగుఁ గా కఖిలసభికు
లనుమతింతురుగాత మద్వినయపణితి. 136

వ. ఇట్లతిగంభీరవినయపాత్రీకృతావచనంబు లుత్తరదేశగమనప్రత్యాస
క్తి దోపం బల్కిన విని సముదితస్వాంతుఁ డై భూకాంతుఁ డక్కు
మారు నిజాంకపీఠంబునకుం దిగుచుకొని సానునయాలాపంబుల
నిట్లనియె 137

తే. నీవు చెప్పినమాటలు నిశ్చయంబు
లైన నినుఁ బాసి యుండలే కేను బరిహ
రోక్తి పల్కిన నీ కవరోధ మయ్యెఁ
గాన సలుపుము నీకిష్ట మైన తెఱఁగు 138

వ. అన, సమాధానగోచరంబులయ్యును దద్వచనంబులు ధ్వనివిశేష
రచనంబులుగా యోజించి పరేంగితజ్ఞానవిశారదుండగు భూసురకుమా
రుండు నిజాననంబు తుహినకరశీకర పిహితం బగుకమలంబునుంబోలె
ముకుళించిన, భాస్కరకులాగ్రగణ్యుం డతనిం జూచి నీవిట్లుండుటకు
గతం బెయ్యది యని యడిగిన ససంభ్రమంబుగా నతం డిట్లనియె 139

ఉ. దైవము దాతయుం గురువుఁ దల్లియుఁ దండ్రియు బంధువర్గము
న్నీ వని నమ్మియుంటి నిది నిశ్చయ మిందుకు సాక్షి దైవమో
భూవర! భక్తుఁడ న్హితుఁడఁ బోష్యుఁడ బుత్రుఁడ నంచు నమ్మితిం
గావున మీరలిట్లు స్వరకల్పనవాక్యము లాడ ధర్మువే. 140

క. నీయిష్ట మైన తెఱఁగున
నీయు మనెడువాక్యమందు శ్లేషస్వరవి
జ్ఞేయంబై భేదాధ్వవ
సాయము నామదికిఁ దోఁచె జగతీనాథా. 141

మ. భవదాజ్ఞేతరలబ్ధవాసవపదం బైనం దృణప్రాయమ
ట్లవలోకించెద మీరొసంగినఁ దృణం బైనన్ మహామేరువం
చు వచింతున్ నను వేఱుసేయ ధరణీసుత్రామ! యే నెవ్వరో
యొవరో నాస్వజనంబు సర్వమును మీరే యీన తీయం దగున్

చ. అన విని భూవిభుం డతిదయారసపూరితచిత్తవృత్తి ని
ట్లను ధరణీసుపర్వ! సుగుణాఢ్య నినుం బరవాసభూమికిం
బనిచి నిమేష మోర్వమిని బల్కితి నింతియ గాని సీతలం
పున కిరతంబు సేతు నె ప్రపూర్ణమనోగతిఁ బోయి రావయా. 143

క. అన విని సదస్యు లందఱు
జననాథునివాక్య మింతసరసం బగు నే
యనుచును మా కనుకూలం
బనుకూలం బని రతిప్రహర్షాత్మకు లై. 144

వ. ఇవ్విధంబున ననుజ్ఞాతుం డై తనయభిలాషం బొడగూడుట కఖిలభూమండలాభిషేకంబువంటిదియ సంతసిల్లి మెల్లన నభ్యంతరమందిరంబున కరిగి శచీసమాన యగు రాజేంద్రదేవిం గాంచి తనవృత్తాంతం బంతయు విన్నవించిన నన్నారీతిలకం బక్కుమారవరు సాదరంబుగా విలోకించుచు నతనితో ని ట్లనియె. 145

ఉ. ఓకులపావనా! విను మహోగ్రభుజంగవరాహభల్లుకా
నేకపసింహగండకవనేచరదుష్టసమాకులంబు బా
ధాకలితంబు గావున, నుదగ్దిశ కేగుట మానుమయ్య భో
గైకనిధాన మీ వరుగఁ గారణ మెయ్యది చెప్పు నావుడున్. 146

మ. జననీ! యుష్మదనుగ్రహంబున సమస్తైశ్వర్యముల్ బొందితిన్
జననాథాత్మజభాగధేయుఁ డనఁగా శ్లాఘ్యుండ నై యుండితిన్
విను లోపం బొకయించు కేని యెఱుఁగన్ విశ్వంబు జూడంగ నా
మనముం బ్రీతి వహించె మీ రనుప సామర్థ్యంబునన్ బోయెదన్

చ. అనిన సతీశిరోమణి దయారసపూరితచిత్తవృత్తి ని
ట్లను ధరణీసుపర్వ సుగుణాఢ్య నినుం బరవాసభూమికిం
బనిచి నిమేష మోర్వమిని బల్కితి మింతియు కాని నీతలం
పున కితరంబు సేతు మె పరిపూర్ణమనోగతిఁ బోయి రాఁగదయా.

తే. ఇట్లు భార్యయు భర్తయు నేకవాక్య
సరణిఁ బల్కిన నాశ్చర్యసాగరావ
గాహుఁ డగుచును సంతోషసాహసములు
మతి బెనంగొన వీడ్కొని మరలె నతఁడు. 149

సీ. మగుడ భూపతిసభామధ్యంబునకు వచ్చి
తన కిచ్చునాజ్ఞ నౌదల ధరించి
సభికజనాశీర్వచనము లాలించుచు
గురుహితాలాపసంభరితుఁ డగుచుఁ
బోషకపితృవచోపేక్షితుఁ డగుచును
సకలజనానందసౌఖ్యకారి
యగుచు నద్దినశేష మచ్చట నివసించి
మఱునాఁడు కదలి యుత్తరదిశాభి
ముఖుఁడునై యేగి శకునంబు ముఖ్యమయిన
దంచు మదిలోన రాజు మన్నించుచును గ
భీరభేరీమహారవం బారవినుచు
రాజవీథిని బోవఁ బౌరాళి చూచి. 150

ఉ. అక్కజ మందుచుం విపులహర్మ్యతలంబుల నెక్కి చూచి యు
మ్మక్క! యి దేమిచోద్య మనుమానము లే కిటు దూరదేశ మీ
యొక్కఁడు బోవ రాజు గని యుత్సుకతం దగ నూరకున్నవాఁ
డిక్కులపావనున్ సుగుణు నీసుకుమారునిఁ బంపఁ బాడియే? 151

వ. అని పౌరాంగన లనేకవిధంబులఁ బలుకుచు నితనికి వగవం బని లే దనువారును, నిక్కమూరుం డమానుషతేజుండు గావున నితనికి దుష్ప్రవేశం బెందును లే దనువారును, జననీజనకులచేతం బెనుపంబ డనివానికి దేశదిమ్మరితనంబు గలిగియుండు ననువారును, మన మేమన్న నేమగుం గావున నీరోగదీర్ఘాయుష్యంబును, మనోరథసాఫల్యంబు నగుంగాక ననువారును, యితనికిసంచారాపేక్ష కలిగిన రాజు సైన్యసమేతుం జేసి పంప వలదా యనువారును, నిక్కమూరునితలం పిట్టిది గావలయుంగాకున్నం బతికిం దాత్పర్యంబు లేదా యనువారును నివ్విధంబున నానాబాలవృద్ధజనంబు లేకంబై కోలాహలంబుగాఁ బలుకు వాక్యంబులు విని తనయందున సమస్తజనంబులకుం గల్గినయనుగ్రహాతిరేకంబునకు నివ్వెఱఁ గందుచు భూమీసురుం డందఱం జూచి ప్రాంజలి యగుచు నారలకరుణాకటాక్షవీక్షణంబుల వీడ్కొనినవాఁడై పురంబు నిర్గమించి తత్సమీపవర్తి యగుశమనావతి దాఁటి కతిపయప్రయాణంబులం బోయి పోయి, 152

మ. ద్రవిడాభీరతురుష్కబర్బరపుళిందాభిఖ్యకాశ్మీరమా
ళవనేపాళసుధన్వచోళరుషికాలాటత్రిగర్తాంధ్రసిం
ధువరాటంబును భద్రపాండ్యకుకుహూందూశూరసేనాంగపాం
డ్యవిదేహాదిక మైనదేశములఁ జూడం బోవఁగా నొక్కెడన్. 153

మ. అటఁ గాంచెం ధరణీసురుఁ డతులామ్లాశ్వత్థపున్నాగస
ద్వటహింతాలతమాలతాలకదళీద్రాక్షాగరుచ్ఛాల్మలీ
కుటజప్లక్షకదంబనింబసరళాంకూలాదిభూమీరుహో
త్కటనీరంధ్రగుహాంధకారపటలాగణ్యం బరణ్యం బొగిన్. 154

సీ. శార్దూలశరభోగ్రసామజసైరిభ
గండకకిటిమహోద్దండరవము

వ్యాళవిషానలజ్వాలావళీదగ్ధ
కీచకాటవిసముద్గీర్ణరవము
పర్వతాంతరసముత్పతనపంచానన
క్ష్వేళాంతరితదరీవిపులరవము
శాఖిశాఖాగ్రసంచారవానరసమూ
హాభీలకలహామహారవంబు
నేక మగుచు భయంకరాలోక మగుచు
జాలఁ జెట్టులఁ బుట్టల సందు లేక
యిసుక చల్లిన రాలనియిఱుకువనము
సొచ్చె మృత్యుముఖంబులోఁ జొచ్చినట్లు. 155

వ. ఇట్లతిభయోద్వేగజంతుసంతానసంచారంబు గావునమనుష్యులను
చుప్రవేశం బయి సూచికాయితకరాళశిలాకంటకవికీర్ణంబు గావునఁ
జరణవిన్యాసదుర్భరం బై; భానుకిరణప్రసారశూన్యంబు గావున బహు
రోగజనకం బై దుర్జనసంపత్తియుంబోలె జనమనోహారవిరహితం బై;
పామరజనసంసారంబునుంబోలె దురంతరం బై; కీటకకుటీరంబునుంబోలె
నిర్గమద్వారశూన్యం బై; యున్నయమ్మహారణ్యంబునం బడి వెడలును
పాయంబు గానక విభ్రాంతచేతస్కుం డై పంచదివసంబు లం ద సంచ
రించుచు దుష్టమృగోరగసంచయం బవలోకించుచు వెగడుపడి వికలేం
ద్రియుండగుచు క్షుత్పిపాసాపరవశత్వంబు నొంది సంచారంబునం దసమ
ర్థుం డై మరణంబు సిద్ధం బయ్యెననితలంచుచు విమలజ్ఞాననిధి యయ్యు
ను బాల్యంబు గావున ధైర్యంబుదక్కి యుల్లంబు ఝల్లన భయస్వేదా
శ్రుజలావగాహితశరీరుం డై గద్గదస్వరంబున ని ట్లని వితర్కించె, 156

మ. అహహా నాదువివేకపాకమున కేమందుం ధరాలోకన
స్పృహచేఁ గాశిగయాప్రయాగలు కురుక్షేత్రాదికంబుల్ సుఖా

వహమై యుండఁగ నందుఁ బోక శరభవ్యాఘ్రాతిసంచారదు
స్సహానం బిందుల కేగుదెంచితి సుధీజాడ్యుల్గదా ఛాందసుల్. 157

సీ. నిమిషార్ధ మయిన న న్నెడఁబాసి యుండని
భూవరేణ్యుం డెంత పొగులు నొక్కొ
ధరణీశుదేవి మాతల్లి సాధ్వీమణి
చింతాకులత్వంబుఁ జెంద దొక్కొ
దయతోడఁ బెంచినతలిదండ్రు లిద్దఱు
దుఃఖభావంబునఁ దూలరొక్కొ
దేశికుం డురుకళాధిపుఁడుండు నారాక
కెదురు చూచుచు నెంత బెదరునొక్కొ
ప్రియసహోదరజన మెంత భీతిలెదరొ
మోసపోయితి నిఁక వట్టియాస లేల
కుడిచి కూర్చుండి తెచ్చితిఁ గడుముదమున
మహి నభాగ్యుల కెట్లును మంచి గలదె? 158

శా. ఆరాజన్యవరుండు దేవియు మనోహ్లాదానుకంపారస
ప్రారంభోక్తి మరల్పఁ బౌరులు నివారింపన్విచారింప కీ
ఘోరారణ్యములోనఁ జిక్కితి మహాకూపంబులోఁ బడ్డయ
ట్లేరీ దిక్కిఁక నాకు సాహసులకున్నేపార వే యాపదల్. 159

క. విప్రు ల్పశ్చిమబుద్ధు ల
నేప్రాజ్ఞులమాట యయ్యె నిక్కము సుఖదుః
ఖప్రాప్తికారణములు ఘ
టప్రారబ్ధములు గద దృఢంబుగ నరయన్. 160

వ. అని యనేకవిధంబుల బ్రాహ్మణోత్తముండు విహ్వలమానసుం
డగుచుఁ గొంతవడికి వివేకింపుచు 'విపద్ధైర్య' మ్మని పెద్దలు చెప్ప

దురు గావున విలపించిన వినియోగంబు లే దనియు నాపన్నరక్షకుం డైనపుండరీకాక్షు నాశ్రయించుట కర్తవ్యం బనియుఁ గృతనిశ్చయుం డై ధైర్యం బవలంబించి శ్రీమన్నారాయణచరణకమలంబులు మనం బునం దలంచుచు నిటలతటఘటితకరపుటుం డై యిట్లని స్తుతియించె

చ. కరివరదాయ! భక్తజనకల్పమహీరుహశేఖరాయ! సుం
దరహరినీలకాయ హసితాంబుధరాయ! సురేశముఖ్యని
ర్జరమకుటాగ్రరత్నఘృణిరాజితపాదసరోరుహాయ! వి
స్ఫురదురుకుండలోజ్జ్వలకపోలయుగాయ! నమోనమోస్తుతే. 162

క. సకలచరాచరజంతు
ప్రకరం బెవ్వనివిలాసపరికల్పిత మై
ప్రకటోత్పత్తిస్థితినా
శకములఁ గనుపట్టు నట్టిశాశ్వతుఁ గొలుతున్. 163

సీ. కరినాథుఁ డుగ్రమకరిచేతఁ జిక్కి త్వా
శరణంబు వేఁడినఁ గరుణఁ బ్రోచె
నన్న చేఁ గడు భయాపన్నుఁ డై వేఁడఁ బ్రి
సన్నుఁ డై యలవిభీషణునిఁ గాచెఁ
దండ్రిచే విపులోగ్రదండితుం డై నొచ్చి
యభయంబు గోరుప్రహ్లాదు నరసె
ధరణీసురామరోత్కరదారుణుం డగు
బలిసురారిని రసాతలముఁ జేర్చె
నెవ్వఁ డట్టిదయారసనిరుపమాన
విమలహృదయుండు జగదేకవిశ్రుతుండు
వితతసంసరణారణ్యపతితు నన్నుఁ
గృప దలిర్పంగ నిపుడ రక్షించుఁ గాత. 164

ఉ. ఓకమలామనోరమణ! యోమునిమానసహంస! భక్తలో
కైకశరణ్య! యోనిగమగణ్య! విపజ్జలధిన్ మునింగితిన్
నీకరుణాకటాక్షమున నే దరి జేర వలెన్ దయాంబుధీ!
నాకెవ్వ రింక దిక్కొరు లనాథులఁ బ్రోచెడువార లేరయా?

సీ. తలిదండ్రు లిద్దఱు తత్కాలమునఁ బోవఁ
బృథివీశు చేతఁ బెంపించినావు
నానిమిత్తము నీవు నారాయణమునీషి
వరుఁడవై విద్యలు గఱపినావు
బాల్యమ్మాదిగ భోగభాగ్యనిధానస
మ్మాననీయుని గాఁగ మనిచినావు
నీవిలాసం బైననిఖిలభూవైచిత్రిఁ
జూచుటకై బుద్ధి జొనిపినాఁడ
విఘ్నవిధములఁ బెనిచినకష్టకాండ్రి
వీమహారణ్యమునఁ బడి వెత నలంగి
యున్ననను జూచి యిటు లూరకున్నవాఁడ
నేమి సేయుదు నా కేమి సెరవు సెపుమ 166

చ. బలమెడలెన్ మనంబు వెతపాల్పడె ధైర్యముడస్సె నింద్రియం
బులువికలత్వమొందె నిఁకఁ బొల్పుగ నన్నెవ రాదరించువా
రలఘుగుణాఢ్య! సంశ్రితజనావనపావన! నీదుసత్కృపా
విలసన మొప్ప నట్టిశుభవీక్షలఁ జూడుము లోకనాయకా! 167.

సీ. వందారు సురబృంద! వసుదేవనందన!
కందర్పజనక! మంగళము నీకు
కౌస్తుభమణిభూష ఖండితాశ్రితదోష!
గరుడతురంగ! మంగళము నీకు

లోకసంరక్షణా! లోకవిచక్షణా!
కరిరాజవరద! మంగళము నీకు
సకలచరాచరజంతుపూర్ణోదరా
ఖండవిలాస మంగళము నీకు
శంఖచక్రగదాశార్ఙ్గసహితబాహు
దండమండిత! కుండలస్థగితగండ!
తులసిమాలాభుజాంతరస్థలవికాస!
కనకకౌశేయధారి! మంగళము నీకు. 168

ఉ. ఓసరసీరుహాక్ష! కరుణోదధి! యోకపిలాత్రిగౌతమ
వ్యాసవశిష్ఠనారదశుకాదిమహామునిమానసాంబుజో
ల్లాసనిజప్రభావ! సకలామరసన్నుత! మేచకప్రభా
భాసితదివ్యవిగ్రహా! విపన్నును నన్గృపఁ జూడ వే హరీ! 169.

మ. వనటం జెందుచు భూసురాగ్రణిమనోవాక్కాయకర్మంబు లై
క్యనిరూఢిన్ నెలకొల్పి తన్మయత బాహ్యం బేది సూక్ష్మానలో
కనుఁ డై కుంభగతప్రదీపగతి నేకాయత్తచిత్తంబుతో
వినయం బొప్పఁగఁ గేలు మోడ్చి నిలిచెన్ వీతేంద్రియభ్రాంతుఁడై.

వ. ఇట్లు నిలిచి సర్వవ్యాపకుం డైన శ్రీమన్నారాయణుని దివ్యచర
ణంబులు హృదయపీఠంబున నిడికొని యనేకవిధంబుల వినుతించుచు
న్నసమయంబున నాశ్రితవత్సలుం డగు జగన్నాథుండు కరుణాకటాక్ష
వీక్షణం బొలయించిన నమృతపరిసరణంబునం బోలె నిర్గతమనఃఖేదుం
డై సమ్మదాశ్రుపూరితవిలోకనంబుల బహిఃప్రదేశంబు లవలోకించిన 171

శా. హార్యక్షాదిమృగావళుల్ విరిసె గాఢాంధఃకృతమోహజాలముల్
శీర్యం బయ్యెను మార్గముం దెలిసె వీక్షింపంగ శృంగోన్నతా
హార్యం బొక్కటి దూరదృష్టిగత మై యచ్చోట నానావిధా
శ్చర్యంబుల్కడు గానిపించె నపు డాస్వామిప్రసాదంబునన్ 172

వ. కావున ని ట్లతినిబిడమేఘమండలమధ్యంబుననుండి వెడలు భానుం
డునుంబోలె నమ్మహాగహనాంతరంబు నిర్గమించి భూసురుం డుత్తరప
థంబునం బడి దవ్వుదవ్వులం బోవుసమయంబున 173

మ. చటులాహార్యనిరోధితాత్మపథముల్ జాలించి మేఘంబు లె
చ్చటికిం బోవఁగ లేమి భూమి డిగె నాఁ జర్చింప నీలప్రభా
స్ఫుట మై భూరితటిల్లతాళికిఁ దజ్జ్యోతిర్లతాశోభితో
త్కటమై యొప్పగునీలశైల మచటం గాంచెం బ్రమోదాత్ముఁ డై 174

క. కాంచి తదున్నతకటకో
దంచితమందారసుమసుధారసపాన
ప్రాంచద్ద్విరేఫగానవి
పంచీనాదంబు వినుచు బ్రాహ్మణుఁ డరుగన్ 175.

సీ. కనకరత్నప్రభాకనదురుభిత్తికా
స్థగిత కాంతులు ధగద్ధగ యనంగ
శశికాంతవిరచితసోపానసర్మలో
జ్జ్వలదీధితుల్ తళత్తళ యనంగ
హరినీలమణిగణస్ఫురితనీలప్రభా
నికరంబు నిగనిగన్నిగ యనంగ
పద్మరాగద్యుతిప్రతిబింబితానేక
జంతుజాలము చకచ్చక యనంగ

తే. నచటవరగేహగేహాళి నవగవాక్ష
వేదికావళిచేత నుద్వేల మగుచు
నేఁడులోకంబులకుఁ జూడ నీడు లగుచు
వఱలుగృహసప్తకంబు భూసురుఁడు గాంచె. 176.

వ. ఇ ట్లతిభయోద్రేకజనకం బగునమ్మహాగహనంబునదుష్టమృగం
బులవలనిభయంబుఁ దక్కి జనసంకులం బగురమ్యస్థలంబు పొడసూ

వుటకు సమ్మోదంబునం బొదలుచు నింక విజయుండ ననుచు నతిత్వరి
తగతిం జని యొక్కగృహద్వారంబు జేరం బోయి 177

శా. ఏణీలోచన విద్రుమాధరి విశాలేందిందిరాభస్ఫుర
ద్వేణిం బల్లవపాణిఁ బంకజముఖిం బీనస్తనిన్ సైకత
శ్రోణిం జందనగంధి నొక్కసుదతిం జూచెం ధరాదేవుఁ డ
క్షీణాశ్చర్యుఁ డపూర్వదృక్శ్రవణసంశ్లిష్టప్రమోదాత్ముఁ డై. 178

సీ. అష్టభార్యాకరాకృష్టుఁ డౌకృష్ణునిఁ
బాసినకమలనివాస యనఁగ
గంగాపరిష్వంగుఁ గరకంఠుఁ గూడక
తొలఁగి వచ్చినశైలదుహిత యనఁగ
నలయహల్యాజారుఁ డైనవృద్ధశ్రవుఁ
దెగడి వచ్చినశచీదేవి యనఁగ
ధర ననంగుం డైనదనపతి రోయుచు
క్షితి మెలంగుచు నున్నరతి యనంగ

తే. రమ్యసౌందర్యరేఖావిరాజమాన
రూపలావణ్యవిభ్రమోద్దీపితాంగి
యేకతంబున నున్నది యేకతం బొ
యనుచు డగ్గఱి సమ్మోద మలరఁ బలికె. 179.

ఉ. ఓవనజాయతాక్షి! యిటు లొంటిఁ జరింపుచు నున్నదాన వీ
వీవనదేవతామణివొ? విస్మయమయ్యెడు, నీదునామ మై
పావనమైనయట్టిశుభవర్ణము లెయ్యవి నీదుజన్మచేఁ
బావనమైనయట్టి శుభవర్ణము నెద్ది వచింపు నావుడున్. 180

క. విని మందహాసకలితా
నన యై మధురోక్తి వెలయ నారీమణియా

తనికరుణాపాంగాలో
కన మెలయఁగఁ బల్కె సరసగర్భితఫణితిన్. 181

చ. అభినవమన్మథుండవు సహస్రపతితేజుఁడ వగ్రవంశసం
ప్రభవుఁడ వం చెఱింగితిఁ గృపాపరిపాకములోడ దేవస
న్నిభుఁడవు నన్నుఁ జూచినను నిశ్చయ మౌను బరాభిజాత్యవా
గ్విభవకళానుశీలగుణవేద్యపదార్థము రూప మే గదా. 182

వ. అని మఱియుఁ బ్రిగల్భవచనంబు లనేకంబు లుదాహరించుట క భిలాషంబు గల దయ్యును నతని క్షుత్పిపాసార్తుఁగా నెఱింగి వెండియు ని ట్లనియె. 183.

క. అభ్యాగతుఁడవు గాన మ
దభ్యర్చనవిధుల నలరి త్వరితంబుగ నీ
వభ్యవహారము గొనుమీ
లభ్యపదార్థముల వందితామరతిలకా 184.

సీ. అనిన బ్రాహ్మణుఁ డిట్టు లనియె నన్యస్థలో
నతిథి యై వచ్చి గృహస్థునింట
భుజియించువాఁడు తత్పూర్వోత్తరంబుల
నరయుట తప్పఁగా దండ్రు బుధులు
గాన నే నడిగితిఁ గాంతాశిరోమణీ!
యనిన నప్పడు మందహాసరుచిర
కలితాననాబ్జ యై గన్గొని విను మంచు
సర్వమత్సేస్థులు సమ్మదమున
తే. నేఁడుగృహములవార మీనీలశైల
వాసుఁ డైనట్టివైకుంఠవాసునకును
దాసవృత్తిఁ జరించి తదర్చనంబు
లొనరఁ జేయుచు నుందు మివ్వనమునందు. 185

ఉ. దేవతలెల్ల గాతుౕలను దివ్యఫలంబు లఖండభక్తిసం
భావనతోడుత న్సరసభక్ష్యము లర్పణ జేసి సామి సం
సేవ లొనర్చి పోదు రవి చెచ్చెర మే మిలువర్ప నందఱున్
భూవిభునాజ్ఞఁదెచ్చికొని భక్తి యొనర్తు మభీష్టసిద్ధిగన్. 186

క. అనుగుణాకరుఁ డురుకరు
ణాసాగరుఁ డాశ్రితావనై కవికాసో
ల్లాసి యనవరతమును మా
తో సంభాషించు జనకతుల్యుం డగుచున్. 187

మ. సతి యీచొప్పునఁ బల్కఁగా విని మహాశ్చర్యాబ్ధిలోఁ దేలుచున్
శతమన్యుప్రముఖామరాళియు వసిష్ఠవ్యాసవాల్మీకులున్
మతి నూహించి వచింప లేనిపరమానందానుసంధాయకుం
డతిమోదంబున గోచరించుటలు పుణ్యం బెన్నఁగా శక్య మే? 188

వ. అని మఱియు ననేకవిధంబులఁ, గొనియాడుచు భక్తివిశేషంబు
లొప్ప నయ్యెవ్వలకుప్పం గనుంగొని సకలదేశంబులుఁ జూచితి నిట్టి
భగవద్విలాసవైచిత్రి యెందును వినంబడలే దస్మదీయపూర్వపుణ్యవశం
బున సజ్జననివాసస్థలంబు చూడంగంటేఁ, గృతార్థుండ నైతి, నిర్హేతుక
జాయమానకరుణాకటాక్షవీక్షణం బెలయించితివి. కావున స్వామిదర్శ
నంబునుం గావించి పవితుౕనింజేయు మని పార్థించిన నక్కాంతాల
లామం బతని కి ట్లనియె. 189.

క. నీవాంఛిత మేఁ జేసెద
నావాంఛ యొసంగ నీకునర్హము గా దే
నాపుడుఁ బరోపకారికి
దైవము దయ సేయుఁ గా దె తత్ఫలిముల్. 190.

సీ. అనుచు గంభీరోక్తి నాడినవచనంబు
లాలించి మఱియు నిట్లనియె నతివ

పురుషులు కాలానుసరణవచస్కులు
గావున నన్నుం గం గాదటందు
రభయహస్త మొసంగు మయ్య పాణిగ్రహ
ణంబుగాం జూచెద నాత్మలోన
స్వామిదర్శనమును సమ్మతి సేయింతు
ముందు ప్రార్థన జేయు ముద మెలర్ప.
రూపలావణ్యశోభాకలాపమూర్తి,
యెవ్వం డగునని మనమున నెవ్వగలను
నొందునాకీవు దొరికితి సుందరాంగ!
యాడం గటితీర్థ మెదు రైనయట్లు నిజము. 191.

వ. అనిన నతండు నారీశిరోమణి కిట్లు లనియె; నేను బ్రాహ్మణుండ వేదవేదాంగపారంగుడను, మదీయజననీజనకు లచిరకాలంబునం గాలం బుజేసిన బంధుజనశూన్యుండ నై యున్ననన్నుం గొనివచ్చి యుందిద్యున్నరాజేంద్రుం డతిదయాళుం డై పుత్రస్నేహంబునం బెనిపించి సకలభోగభాగధేయునిం జేయుచు నుపనయనవిద్యాభ్యాసాదికంబు లొనర్చిన నేనును ప్రవర్ధమానుండ నై కొంతకాలంబునకు భూసంచారం బొనర్పబుద్ధి పొడమి తదనుమతి వడసి ప్రాగ్దక్షిణపశ్చిమదేశంబులం జూచియుత్తరపథం బవలోకింపుచు నా నతిమన్తరంబును ద్వాదశయోజనాయామంబును నయినమహారణ్యంబునం బడి మార్గంబు గానక చిక్కపడి దైవయోగంబున దుష్టమృగోరగంబులకుం దప్పి వెడలి, యొందిక్కునుం దోంచక క్షుత్పిపాసాపరుండ నై వేమరుచందంబునం బరిభ్రమించుచు నింత నంత నీలశైలంబు గోచరం బగుట నిట కేతెంచి నిన్నుం గాంచి నీకు నాదరణీయుండ నైతి నీ వింక నేమి చేసినం జేయుము. స్వామిదర్శనంబునుం జేయింప వలయు నని ప్రార్థించి మఱియును 192.

సీ. నీవచోమాధుర్యనిపుణత కెంతయు
సంతోష మందితి సరసిజాక్షి!
స్వామిదర్శనమును సమకూర్ప వచ్చిన
నాపూర్వపుణ్యస్వరూపి వీవు
చెలియ నీ కుపకృతిఁ జేయ కున్నను విను
నాకుఁ గృతఘ్నత గాక యున్నె
పురుషు లవిశ్వాసపరు లని యాడితి
వది స్త్రీలయందు సిద్ధాంత మగును
యాదృశీభావనాయత్రితాదృశీ య
టన్నవాక్యార్థ మిచటఁ బ్రసన్న మయ్యె
మనలనిజములు క్రియలను గనఁబడుఁ గద
కుడుచుపండులరుచులు మున్న తుగనేల. 193.

చ. అన విని యాకుమారి ముదమందుచు నాతని చేతిఁ బ్రమ్మికల్
గొని మది నమ్మనా యనిన కోమలి! సందియ మెందు కన్న నె
మ్మనమున విశ్వసింపుచును మానిని జేరెఁ దదంతికంబుఁ గ్రొ
న్ననవిలుకానితూపుక్రియ నవ్యకటాక్షవిలోకనాదృతిన్. 194.

తే. చేరి యాతనిచేతులు చిక్కఁ బట్టి
కన్నులకు గంత గట్టి నగాగ్రభాగ
మార్గసోపానముల నెక్కి మందగతిని
గొంచుఁ బోయె విరించి రాయంచవోలె. 195.

వ. ఇట్లు పోవుచున్న సమయంబున నభ్భూసురకుమారుండు; 196.

ఉ. ఫుల్లసరోజనేత్రి! విను పుణ్యనగంబునఁ గల్గుచిత్రముల్
తెల్లము జూడ నీ కిటు లి దెందు కటన్నఁ బరుల్ గనుంగొన
న్నొల్లరు మద్గురుల్ బుధమనోహర నీకనుమూఁత జేయఁగా
నల్లలితాయతాక్షులకుఁ జాలవు చేరలు; మాటు చేసితిన్. 197

వ. అని యివ్విధంబునం గైదండఁగొని యొక్కింతతడవు ప్రతివచనానురాగంబున సంభాషణంబుఁ జేయుచుఁ నక్కోమలి నీలశైలశిఖరంబున నుత్తాలగోపురోల్లేఖితం బయినదివ్యదేవాలయంబు దరియం జొచ్చి మంటపాభ్యంతరకక్ష్యావాటంబులు గడచి గర్భాలయంబున నున్నకనక కవాటంబు దీసి స్వామిసన్నిధానంబున నిలిపి మహానిధానంబిదిగో నని దెల్పుచుఁ గనుమూఁత దెరల్చి యక్కాంతి స్వామిసమీపంబునకు నొక్కింత యోసరిలిన నతండు; 198.

సీ. లలితకుండలసముజ్జ్వలితకాంతిచ్ఛటా
పటలి సౌదామినీప్రభ లనంగ
చతురచతుర్భుజావృతహేమకౌశేయ
వసన మింద్రధ్వజవ్యాప్తి నలర
గురుతరహారాళిగుంభితతరళము
క్తాఫలనిచయంబు కరన లనఁగ
శంఖచక్రగదాసిశార్ఙ్గసముద్గీర్ణ
చకితశోభాళి చాతకము లనఁగఁ
దనరి కరుణాకటాక్షవీక్షణపరంప
రామృతాఖండవర్ష విరాజమాన
మహితనారాయణాంభోదమండలంబుఁ
గని భయంబున విస్మయకలితుఁ డగుచు. 199

మ. భగవంతుం డని దేవదేవుఁ డని సద్భక్తావనోపాయుని
త్యగరిష్ఠుం డని సృష్టికర్త యని సుత్రామాదిదేవావతం
సగళద్రత్నవిభావిరాజితపదాబ్జాతద్వయుం డంచు నా
జగతీదేవు నెఱుంగ లేక యనిమేషవ్యాప్తినిశ్చేష్టుఁ డై. 200

వ. ఇట్లు భయవ్యాకులమానసుం డై భూగగనభేదంబు లెఱుంగక ధరణీతలంబునం బడి కొంతవడికి ససంజ్ఞుం డై యిట్లని వితర్కించె. 201

ఉ. ఎయ్యది నాదుపేరు? కుల మెయ్యది? యే నిట రాకకుం గతం
బెయ్యది? యెట్లు వచ్చితినొ? యీస్థలమెయ్యది యో నిజంబొ? గా
కియ్యది స్వప్నమో యెఱుఁగ నియ్యెడ నాదురవస్థ బాపఁ బా
లయ్యెడువార లెవ్వ రిఁక నక్కట నే నిఁక నేమి సేయుదున్. 202

క. అని కలవరించు బ్రాహ్మణుఁ
గనుఁగొని వనజాక్షుఁ డపుడు కారుణ్యముతోఁ
దనకరము సాచి నిమిరెను
గనికరమున మందహాసకౌముది వెలయన్. 203.

ఉ. పిన్నవు వెఱ్ఱిబ్రాహ్మణుఁడ! పెన్నిధి గన్నదరిద్రుఁ డార్తిచేఁ
గన్నులు మూసుకొన్నటులు కర్జము లన్నియుఁ దెచ్చి పెట్టినన్
దిన్నగఁ జూడ కట్టిటులు దిక్కులఁ బాఱినయట్లు మత్సమీ
పోన్నతిఁ జెందఁ గల్గియును బొల్పఱి యుంటి వి దేమి చిత్ర మో.

వ. అని మఱియు బహుప్రకారంబుల నక్కమారు డగ్గఱి దిగిచి వెఱవకు వెఱవకు మనుచు వెన్నుదడు ప్రసన్నుం డై యతని వెన్ను జఱచి మధురగంభీరవాక్యంబుల ననునయించిన నతం డత్యానంద బాష్పపూరితనయనుం డై పులకాంకురితశరీరుం డై నేఁటికి భగవత్కైంకర్యంబు దొరకొనిన దనుచు నిర్భయస్వాంతుఁ డై కరతలంబులు ఫాలంబునఁ గదియించి యిట్లని స్తుతియించె. 205.

## దండకము.

శ్రీమద్రమాభామినీమానసాంభోజమిత్రా! భవానీశవాగీశ ముఖ్యామరస్తోత్రపాత్రా! సరోజాతనేత్రా! పయోదాభగాత్రా! లసత్కౌస్తుభోదగ్రమాణిక్యకాంతిచ్ఛటారాజినీరాజితాంభోధికన్యాకుచద్వంద్వనిర్ద్వంద్వపంచాయుధోపేతసీతాసమేతా! ధరాభృత్సమానోరుధీరాబ్ధిగంభీర! వేదాంతసౌధాగ్రసంచార! సౌందర్యజిన్మార! నీహారడిండీ

రకరుచ్యాభరతారాధినాథోపమానస్ఫురత్కీర్తిభక్తానువర్తీ! పదాబ్జాతసంజాతగంగా! శుకవ్యాసవాల్మీకిగర్గాక్షపాదాత్రిమౌనీశహృత్పద్మభృంగా! పతంగాధివాహా! విమోహా! కిరీటాంగదానేకహారావళీమంజుమంజీరకాంచీవిభూషోజ్జ్వలద్దేహా! సౌవర్ణచేలా! దయాశీల! శ్రీకృష్ణగోవిందనారాయణానంతనామా! గుణోద్దామ! శ్రీరామ! శ్రీమాధవోపేంద్ర దామోదరా! శ్రీధరా వాసుదేవాదిదేవా! హృషీకేశ! శ్రీకేశవా! శిష్టసంరక్షణా! దుష్టసంశిక్షణా! నీలశైలాధిపా! నీవు మత్స్యంబవై సోమకుం జంపి వేదంబు లావేధకు న్నిచ్చి, కూర్మంబవై మందరం బెత్తి భూదారివై హేమనేత్రు న్విదారించి తౌ! నారసింహుండవై వానియే న్న న్విశంసించి ప్రహ్లాదు రక్షించి తౌ! పొట్టివై యాబలిం గొట్టి తౌ! శీరివై వైరులం జీరి తౌ! భార్గవాభిఖ్య రాముండవై రాజుల న్రాజులం గెల్చి తౌ, రామచంద్రుండవై రావణుం బుత్రమిత్రాదియుక్తంబుగాఁ గూల్చి తౌ, బుద్ధరూపుండవై దుష్టకర్మాత్ములన్ నేలపాల్జేసి తౌ, నింక గల్క్యవతారుండవై మ్లేచ్ఛహూణాదిదుర్మార్గసంచారులన్ దేవతాభక్తిహీనాత్ములన్ భూసురాపాయులన్ ముందు ఖండింపనున్నాఁడ వో పుండరీకాక్ష! వేదండసంరక్షణాఖండబ్రహ్మాండభాండోదరా! బ్రహ్మరుద్రాదు లైనన్ వచింపన్నుతింపంగ లేరన్న నే నెంతవాఁడన్ దయాదృష్టి వీక్షింపవే! నన్ను రక్షింపవే! వేదవేద్యానవద్యా! జగత్సృష్టిసంరక్షణోత్పాతముల్ నీవిలాసానుసంభూతముల్ గావె! దేవేశ! మత్పూర్వపుణ్యానుభావంబున న్నీపదాబ్జాతముల్ గంటి నీదివ్యశోభావతారంబు ప్రత్యక్షమీక్షించితిన్, నే కృతార్థుండనై తింక శంకేమియు న్లేదయా! మోదదయాసాగరా! రామచంద్రా! జగచ్చక్రవర్తీ! జగన్నాథమూర్తీ! నమో దేవ తుభ్యం నమో దేవ తుభ్యం నమోస్తు. 206.

తే. దివ్యమంగళవిగ్రహ తే నమోస్తు
దేవదేవ! జగన్నాథ! తే నమోస్తు
మానితోజ్జ్వలగుణగణ! తే నమోస్తు
మానివరమానసానంద! తే నమోస్తు 207.

వ. అని యి ట్లనేకవిధంబులం గొనియాడుచుఁ బెన్నిధి గన్న పేదచందంబున న్మహానందంబు నందుచు శ్రీముకుందపదారవిందనిష్యంద మరందబిందులహరి నోలలాడుచుం బాడుచు నున్మత్తునివిధంబున గంతులు వైచుచున్న యక్కుమారుఁ జేరం దిగిచి మందస్మితసుందరవదనారవిందంబుతో మధురగంభీరస్వనంబున నద్దేవదేవుఁ డిట్లని యానతిచ్చె. 208

ఉ. నీవు గుణాగ్రగణ్యుఁడ వనింద్యచరిత్రుఁడ వౌదు గాన మ
త్సేవయు దర్శనంబు సవిశేషవచోవిభవాతిరేకసం
భావనయు న్లభించె నిఁక భద్రము నీ కగు నెద్ది యేనియుం
ధీవర నీకుఁ గోర్కె గలదేని వచింపు మదేను దీర్చెదన్. 209

తే. అనిన నమోఘ్మదనిర్భరితాత్ముఁ డగుచు
దీనపోషణ! దేవరదివ్యమూర్తి
గంటి నిఁక నాకు లోపంబు గల దె యైన
మదభిలాషను వివరింతు ముద మెలర్ప. 210

క. ఘనుఁ డింద్రద్యుమ్నుం డను
మనుజేంద్రుఁ డఖండవిభవమహనీయయశో
ధనుఁడు జగదేకశౌర్యుఁడు
నను బెనిచెను సుతులకంటె నతిమోహముతోన్. 211

ఉ. దేవ! తదీయరక్షణవిధిం బెనుపందితి నెల్లవిద్యలుం
భావన జేసినాఁడ గురుపాదసపర్యలు సల్పి యంతటన్

భూవలయంబు సర్వమును బొల్పుగఁ జూడఁగఁ గోరి యాధరి
త్రీవరునాజ్ఞచేఁ దిరిగితిం బురజానపదాటవీస్థలుల్. 212

ఆ. ఇట్లు తిరిగి తిరిగి యెం దేని నేమియుఁ
గాన కేను వెత్తివానివలెను
వచ్చి పూర్వపుణ్యవశమునఁ నిమ్ముఁ గంటి
నహహా! జన్మ సఫల మయ్యెనింక. 212

క. నాజన్మము నీకృపకును
భాజన మై వెలసెఁ గాన భవదంఘ్రియుగాం
భోజవిలోకనదశ మా
రాజునకుం జేయ వల దె రాజీవాక్షా!. 214

తే. కాన నీయాజ్ఞ గయికొని మానవేంద్రుఁ
దోడి తెచ్చెదఁ గరుణింపు తోయజాక్ష!
నామనోభీష్ట మెడసేయకో మహాత్మ!
పరమకల్యాణగుణధామ! భవ్యనామ. 215

మ. అన విని దేవదేవుఁ డమితాదర మొప్పఁగ భూసురోత్తముం
గనుఁగొని నీయభీష్ట మొనఁగ న్మది నూనఁ దలంపు గాన నీ
వనఘ! గుణాఢ్య! యుక్తపరివారముతో నృపుఁ దోడి తెమ్మటం
చనుమతి సేయఁగా నతఁడు సమ్మతబాష్పజలావగాహుఁ డై. 216

సీ. కేలు మోడ్చెద నీకు కేశవ! గోవింద!
దీర్ఘాయురస్తు పృథ్వీసురవర్య!
దాసుసమీరఁదను దయ యుంచు మో దేవ!
భక్తరక్షణమాకుఁ బరమవ్రతము;
పోయి వచ్చెద భక్తపోషణధారేయ!
వేగ రమ్మని సెల నిచ్చినాము;

దేవర! యిక్కన్యతివిరి నన్ను వివాహ
మగు మను చున్నది తగవు చెపుడి;
నీకు దీనికి విధినిర్ణీత మై యుండె
మీయాజ్ఞ నెవ్వరు మీఱఁ గలరు;
ఉత్తరప్రత్యుత్తరోక్తులు వినికన్య
దాపునకును రా, దయాపరుండు,
తరుణి నీ కితనికి దాంపత్య మానన,
భనదనుగ్రహముచేఁ బ్రాప్తమయ్యె;
నగుఁ గాక బొ మ్మనె నగధరుం డంతట
నుభయులు గూడి మహోత్సవమున
వెడలుచో నత్తన్వి వేత్త్వేఱఁ జూపుచు
బ్రహ్మణోత్తముతోడఁ బలికె మఱియు
మంటపాభ్యంతరమందిరవాసుల,
క్షేత్రపాలకు ఫాలనేత్రుఁ జూడు
మఱియు విష్వక్సేనమాన్యుని జూడుము
దివ్యవిగ్రహు వైనతేయుఁ జూడు
శేషాహిఁ జూడు మ శేషధురంధరు
నతిబలాఢ్యుని మరుత్సుతుని జూడు
మనుచుఁ జెప్పిన నతం డనితరసాధ్యము
ల్దగ ఫలించుట భవత్కరుణగాదె
యని వచింపుచు వారల నభినుతింపఁ
దలఁచి ప్రాంజలి నొదల నిలిపి భక్తిఁ
సంభ్రమామోదహృదయుఁ డై సరసవచన
రచన నుతియించె నపుడు ధరామరుండు. 217

చ. శశిమకుటాయ మౌనిజనసంస్తవనాయ శివాయ శాంభవే
పశుపతయే భవాయ భవబంధహరాయ హరాయ మల్లికా
విశదపటీరహీరరతనువిస్ఫురితాయ శివామనోహరా
య శమదమక్షమాదిసుగుణాభరణాయ! నమోనమోస్తుతే. 218

క. కుశకీకృతరక్షోజన
కుశలీకృతభక్తసుజనకోమలచరణా
ప్రశమీకృతతాపత్రయ
విశదయశోదిగ్వితాన విష్వక్సేనా! 219

క. భూరిభుజాబలశౌర్యో
దారులు గంభీరు లధికధైర్యులు జితజం
భారు లతులముఖశోభా
కారులు జోహారు మీకు గరుడాళ్వారూ! 220

క. సకలచరాచరజంతు
పరికరమహీభార మెల్ల భవదీయఫణా
చకితాగ్రరత్నమట్లుగ
శిరఁ దాల్చితి వమలసాంద్ర శేషాహీంద్రా! 221

సీ. శ్రీరామపదభక్తశేఖరాయ సరోజ
బంధుజాపధ్వాంతభాస్కరాయ!
లక్ష్మణప్రాణసంరక్షణదీక్షాయ
యక్షకుమారసంశిక్షణాయ!
సీతావియోగసంజాతార్తిరఘురాము
ఖేదాపనయనాభివాదనాయ!
సకలమహాసీశ్వరసన్నుతసుగుణాయ
పాదాంగుళీక్షిప్తపర్వతాయ!

నిజతనుద్యుతినిర్జితనీరదాయ!
సవ్యగానపరాజితనారదాయ!
భవ్యకీర్తివినిందితపారదాయ!
యాంజనేయాయ బుధజనరంజనాయ! 222

వ. అని యిట్లుహరిగరుడవిష్వక్సేనశేషాంజనేయులకు విధేయుండై దండనమస్కారంబు లొనర్చి వారలవలన ననుజ్ఞ గొని భూతలంబునకు నిర్గమించి తత్తత్ప్రదేశంబులం గలచిత్రవైచిత్ర్యంబుల కత్యాశ్చర్యహృదయుం డగుచు దేవసంచారస్థలంబునకు వచ్చితి మదీయజన్మాంతరపుణ్యవశంబున గాకేమి యనుచుఁ గన్యాసమేతుండై దాని గృహంబునకు వచ్చి యిష్టాన్నపానంబుల సత్కృతుండై యుక్తవర్తనంబున భగవద్దాసజనంబులతోఁ గలసి మెలంగుచు నిటనచ్యుతాఁ డై సుఖుండుండెనంత. 223

మ. హరి గోవింద ముకుంద చక్రధర కృష్ణానంత నారాయణా
నరసింహాచ్యుత పార్థసారథి జగన్నాథా రమావల్లభా
వరకేయూరకిరీటకుండలధరా వైకుంఠవాసప్రభూ
పరమోదారగభీర భక్తవరదా పాపాటవీపావకా! 224

మా. సరసిజదళనేత్రా చారుసౌందర్యగాత్రా
పరమసుగుణధామా భద్రశైలాభిరామా
చిరతరశుభకీర్తి చిద్విలాసానువర్తీ
శరణుజనశరణ్యా శాశ్వతానందగణ్యా! 225

గద్య: ఇది శ్రీమద్గౌతమగోత్రపవిత్రరామయామాత్యపుత్రసుజన విధేయసూరయనామధేయప్రణీతం బయిన శ్రీజగన్నాథమాహాత్మ్యంబునం బ్రథమాశ్వాసంబు సర్వంబును
సంపూర్ణంబు.





శ్రీరస్తు.

శ్రీగణాధిపతయేనమః.

# శ్రీ జగన్నాథమాహాత్మ్యము.



## ద్వితీయాశ్వాసము.

——(౦)——



శ్రీధర నిజతనువిజితాం
భోధర బ్రహ్మాదివిబుధపూజితచరణా!
బోధానందరసాయన
సాధీకృతనిగమసీమ జగదభిరామా! 1

గీ. అవధరింపుము దేవ! య ట్లవనిసురుఁడు
రాక యుండుట కెంతయు రాజు మనము
లోనఁ దలపోసి చింతావిలోలుఁ డగుచు
విబుధజనముల రావించి విన్నవించె. 2

చ. మతి చెడి పంపినాఁడ సుకుమారుఁ గుమారుఁ గుమారమన్మథుణ్
వితతభయోగ్ర మైనయటవీస్థలికిం దడ వయ్యె రామికిణ్
గత మది యెద్ది యొక్కొ దగ నారసి నిశ్చయ మొప్పఁ జేయుఁడే
గతి భరియించెదణ్ దురవగాహమనోవ్యసనాతిభారముణ్. 3

వ. అనిన వా రందఱు రాజపురందరున కిట్లనిరి. 4

మ. జననాథోత్తమ నీమనంబు విచికిత్సవ్యాప్తి గా నేలయా!
ఘనయోగంబునఁ జూచినార మతఁ డకాంతారమార్గంబునణ్

జను-చో నొక్క-మహాటవిం బడి మదిఁ సంకోచముఁ
బొంది స్వా
మిని భావించి విశోకుఁడై యరిగి యామీఁదన్ మహానీలశై
లనివాసుఁ గని సంప్రమోదుడగుచుఁ రా నున్న వాఁ డిమ్ముగలన్.

క. అని నిశ్చయించి పల్కిన
జననాథుఁడు విని యపారసంతోషుం డై
మన మలర భూసురాళిం
గనుఁగొని శపథంబు జేసెఁ గారుణ్యమునన్. 6

క. భవదుక్తివ్యతిరేకము
భువిఁ గలదె బ్రిపూర్ణయోగపూరితచిత్తుల్
కవిగురుసమానధిషణులు
నవితథవాక్యానుభావనై పుణ్యపరుల్. 7

వ. అని యనేకవిధంబులం బుధజనంబులఁ గొనియాడి మఱియు ని
ట్లనియె. 8

సీ. చిన్నియజ్ఞన సుకమున్న వాఁ డని యాన
తిచ్చెది రది యెంత తెల్ల మరయ
మఱియు భూసురుఁ దాడ మసలుట చూచితి
మన్న వారలకుఁ బ్రిసన్నమతిని
వీఁడుగో భూసురుం డేతెంచి నని చూచి
చెప్పినవారికి శీఘ్రిముగను
గొఱత లే దిఁకఁ బ్రేమగుణ్ణని దృష్టిగో
చరము చేసిన వారి కురుతరముగఁ
గనకరత్నచయంబు గోగణము సగము
ధరణిభాగంబు రాజ్యమంతయును నిత్తు

నతఁడు నేనును గలసి సౌఖ్యానుభూతి
జరుగుచుండెద మిది నాకు సద్వ్రతంబు. 9

వ. అని నిశ్చయంబుగాఁ బల్కిన దేవా! దేవరకటాక్షంబున సమస్త జనంబులు సర్వసంపత్సంపన్ను లయి యున్నవారలు వీ రింక వేర యొసంగ వలయు నె వ్వైనను సంతోషసమయసంభావితంబు లగువాక్యంబు లాదరణీయంబులు మీయభీష్టంబు శీఘ్రం బ సఫలంబు గానున్నయది యని నిరూఢంబుగాఁ బలుకుచు ననుజ్ఞాతు లై నిజనివాసంబులకుం బోయిరి రాజేంద్రుండును నభ్యంతరమందిరంబునకుం బోయె, నంత నిక్కడ, 10

మ. ధరణీదేవుఁడు గొన్నినా ళ్లచట మోదం బొప్పఁగా నిల్చి య
త్తరుణీ వీడ్కొని రాజు దేవులు మనస్తాపంబునం బొక్కుచుం
దు రటంచున్ మదిలోఁ దలంచి మరలె న్దుష్టోరగవ్యాఘ్రభీ
కరభల్లూకవిహారఘోర మగునకాంతారమార్గంబునన్. 11

చ. వనసిధిం దాఁటినట్టియులవాయుతనూజుఁడుబోలె నెమ్మనం
బున హరిపాదము ల్దలఁపి భూరిజవోన్నతి నిర్గమించె న
వ్వన మవనీసురుం డచటివన్యఫలాదులఁ దృప్తి బొందుచున్
జనపదము ల్పురంబులు విశాలనదీనదముల్ గ్రమంబునన్. 12

వ. ఇట్లు కతిపయమాసంబులకు రాజసందర్శనోత్సాహంబున నధ్వగమనాయాసంబు లేక యతిత్వరితగతిం జని శమనావతీపురంబుఁ బ్రవేశించె నాసమయంబున బౌరజనంబు లన్యోన్యసమాహూయమానను లగుచుఁ దత్తత్సమయసముచితమజ్జనభోజనాదికంబులు వదలి సంభ్రమోత్సాహసముచ్చారితసంభాషణకోలాహలంబుగా నెదుర్కొని యతిమనోహరుండగునక్కుమారవరుం గనుంగొని సంప్రమోదాయత్తచిత్తంబులతో ని ట్లని వితర్కించిరి. 13

చ. ఇటు లోకరుం దుదీచిదిశ కేగి యుపంతము దుష్టజంతువి
-స్ఫుటగహనాంతరంబులను జొచ్చి భయం బెదఁ జెంద కుండగా
దిటమరి వచ్చినాఁ డహహా! దేవసమాను డనంగ వచ్చు న
క్కట ధరణీశుపుణ్యమునఁ గాదె పదంపడి చూడఁ గల్గుటల్? 14

వ. అని యనేకభంగులఁ గొనియాడుచున్నయాబాలవృద్ధజనంబులవా
దం బపరిమితం బై జలధిస్వనంబు ననుకరింపుచుండ మందగమనంబు
నఁ దత్తదుచితప్రణామప్రత్యుత్థానవినయసంభాషణాదికంబుల సంతు
ష్టాంతరంగులం జేయుచు రాజమార్గంబునం జనలోకవిలోకనీయుం డ
గుచుఁ, బౌరులు తోడ రా నగరసమీపంబునకు వచ్చుసమయంబున
రాజద్వారంబున నున్నకింకరు లక్కుమారశేఖరుం జూచి రాజున కెఱిం
గించుట కేమ మేమనునెలుంగులతో సభాభవనంబు జొచ్చి. 15

సీ. వింజామరంబుల విసరుకాంతలహస్త
కంకణక్వణములు ఘల్లు రనఁగ
సంగీతసాహిత్యసరసకళానాద
వాదంబు జనులకు మోద మొసఁగ
జయ మహారాజేంద్ర! సార్వభౌమ యనెడు
వందికైవారము లొందఁడింప
సమయగతానేకసచివోత్తరాలాప
చాతుర్య మెంతయు జరగుచుండ
వేణువీణానినాదము లెల్లయుచుండ
శాస్త్రచర్చావిలాసము లలుపుచుండ
భూరిభేరీరవంబులు భోరుకొనఁగ
నిండుకొలు విచ్చుచున్నయానృపునిఁ జూచి, 16

శా. దేవా! దేవర! పుణ్యమూర్తి యగుపృథ్వీదేవుఁ డేతెంచినాఁ
డీవిజ్ఞాపన సేయ వచ్చితి మనం డెందంబునం బొంగుచుం

దైవానుగ్రహ మెంతయుం గలిగె నో దథ్యంబుగా నేఁటి కి
ష్టావాప్తిం దగఁ జెందఁ గల్గె నని బ్రహ్మానందముం బొందుచున్.

వ. సత్వరంబుగా నభ్యంతరమందిరంబుల నున్న దేవులకు యజ్ఞన వచ్చుటఁ దెలుపుట కై యొక్క కంచుకిం బనిచి తానును దక్షిణంబ సకలసామంతసచివపురోహితబంధుజనసమేతంబుగాఁ గదలి మంగళతూర్యఘోషంబులు వందిమాగధగాయకగానంబు లులియ సింహద్వారంబు జేరం జనుసమయంబున నతఁడును బురంధ్రీజనసమర్పితనీరాజనకును మాక్షతాద్యనేకశుభలాంఛనలాంఛితుం డగుచు సమీపగతుం డై సన్నతి నిభూపోత్తముండు జూచి ప్రేమోవాశ్రుపూరితనయనుం డై మార్గంబుఁ గానకప్రియుత్నంబుతో డగ్గరిన భూసురుండు బ్రహర్ష భాసురుం డగుచు, మహారాజ! భవత్కుమారుఁడ; యజ్ఞనాభిధేయుండ నిదె వచ్చితి ననిన గాఢాలింగనంబును మూర్ధాఘ్రాణంబును గావించి పరమానందబున స్పృహావివశుం డై కొంతవడికిఁ దెలిసి తెలియం జూచి మఱియు నెత్తికొని సభాభవనంబునకు వచ్చి సింహాసనంబునఁ గూర్చుండి తొడలపై నిడుకొని శరీరంబు నిమురుచు గద్గదస్వరంబుననతనితో నిట్లనియె. 18

సీ. నాతండ్రి! నినుఁ బాసి నయనంబు లెంతయు
నంధకారవ్యాప్తి నడఁగి యుండె;
నెమ్మనం బతిభీతి నుమ్మలింపఁ దొడంగె;
సకలేంద్రియంబులు చట్టుకొనియె;
వ్యావహారికకథావ్యాసంగ మెడలెను;
భోజనాపేక్షయుఁ బొలుగుపడియె;
నిద్రాదిసుఖములు నిముస మైన నెఱుంగ;
భద్రయానోత్సాహపరత సమసె;

పుత్రమిత్రానురాగంబు పూర్తి యయ్యె
సర్వకార్యభరంబులు సన్న మయ్యె
నిన్నుఁ జూచుట ప్రాణము ల్నిలిపినాఁడ
మాకు సకలంబు నీ వ కాదే కుమార! 19

తే. అని యనేకవిధంబులఁ బనువుచుండఁ
జూచి సభికులు బాష్పాంబుచుంబితాక్షు
లగుచు వారించి రవనీశు జగతిదేవు
నతులసౌహార్దవాక్యామృతాప్తి వెలయ. 20

వ. అంత భూకాంతుండు సమస్తజనంబులఁ గూర్చుండ నియమించి
యక్కుమారు నవలోకించి, 21

ఉ. భూరిగుణాఢ్య యుత్తరము బోయెద నన్నవు డేను వల్లనం
దారుణవృత్తితోడఁ జని తక్కట దుర్గమభూమి దేవసం
చారము దుష్టఘోరమృగసంకుల మెట్లు చరించి తో సవి
స్తారముగాఁగఁ జెప్పు మనఁ దద్దయుభక్తి నతండు నమ్రుడై. 22

సీ. రాజేంద్ర! విను ముత్తరంబు జూడఁగ భవ
దాజ్ఞ గైకొనిపోయి యపుడు వేగ
పురములు జనపదంబులు దివ్యనదులును
రమ్యదేవాలయారామతతులు
గనుగొంటి భూసురుల్ ఘనయోగతత్పరుల్
భూభుజులాహవస్ఫూర్జితమతు,
లంఘ్రిసంభవులు బలాధికుల్ తక్కిన
వార లందఱు భజసారపరులు
సకలధనధాన్యవస్తుగోప్రకరములును
త్యాగభోగపరాయణోత్సాహ మొప్ప

నీదుభయమున హద్దులో నిలచినారు
వారి నోర్వంగ నన్యులవశమె జగతి. 24

వ. ఇట్టిజనసంకులం బగుదేశంబునం గలచిత్రంబు లరయుచు నుత్తరసముద్రతీరంబు చేరం జనుటకు నుద్యుక్తుండ నై యొక్కరుండను భవత్కరుణాతిరేకంబు సహాయంబుగా నమ్మహాగహనంబునం బడి పోవుచుఁ బారంబు గానక, యం దనేకగిరిగహ్వరంబులు దాటి నిబిడాంధకారం బగునొక్కమహారణ్యంబునం జిక్కి సింహశరభశార్దూలగండభేరుండగజగవయభల్లూకాదిజంతుభైరవారావంబులకు వెఱచుచు నేదిక్కునుం గానక, మహాప్రభో! చెప్ప వెఱచెద మిమ్ము మగుడం జూడ ననుచుం దోఁచె; నివ్విధంబున నే డహోరాత్రంబులు నిద్రాహారంబులు లేక, దురపిల్లుచు దిరిగితి ననిన రాజశేఖరునకు నవ్వాక్యంబులు కర్ణశూలంబు లైన మూర్ఛిల్లి పరిచారకులయుపచారంబులం దేలి భూసురుం జూచిన నతం డతనితో; నట్లు భయాతురుండ నై కొంతవడికి ధైర్యం బవలంబించి యాపన్నరక్షకుం డగుజగన్నాథుం దలంచి యనేకవిధంబులఁ బ్రస్తుతించిన నప్పుండరీకాక్షునిదివ్యకటాక్షవశంబున;

శా. హర్యక్షాదిమృగావళుల్ విరిసె, గాఢాంధ స్తమోజాలముల్
శీర్యం బయ్యెను, మార్గముం దెలిసె, వీక్షింపంగ శృంగోన్నతా
హర్యం బొక్కటి దూరదృష్టిగత మై, యచ్చోట నానావిధా
శ్చర్యంబుల్ గనుపింప నయ్యె, నవు డాస్వామిప్రసాదంబునన్. 25

మ. కనుఁగొంటి న్నరనాథవర్య! విను మక్కాంతారమధ్యంబునన్
జనుచో నీలగిరీంద్ర మవ్వల లసత్సోపానసౌధావళీ
కనకోద్యన్మణిదీధితిప్రకటితాగారంబు లామీఁదటన్
వనజాతాక్షి నొకర్తు నద్భుతరసవ్యాపారభావోన్నతిన్. 26

క. కన్నాఁడను, నాతిథ్యము
గొన్నాఁడను దానివలన గోవిందుకథల్

విన్నాఁడ స్వామిఁ గనుటకు
సన్నుతి యొనరించినాఁడ సద్భక్తిమెయిన్. 27

చ. అదియు వివాహమాడ మని యెంతయు వేడిన, యుష్మదాజ్ఞలే
నిది తగ దంచు నే నపు డనేకవిధంబుల నొవ్వఁ బల్కినన్
ముదితయు విశ్వసించి యనుమోదిత యై ననుఁ గొంచు నాదయా
స్పదుపదపద్మసన్నిధికిఁ జయ్యనఁ జేర్చె ధరాధిపోత్తమా! 28

చ. గిరిశిఖరాగ్రిభాగమున కేగి జగత్పతిఁ జూచి దివ్యనుం
దరతనుశోభితంబు లయి ధాగధగద్ధగితంబు లైననూ
పురకటకాంగదంబులు కపోలయుగాంచితకుండలంబులున్
స్ఫురదురుకౌస్తుభప్రభలు జూడఁగ లేక విహీనవృత్తితోన్. 29

వ. మఱియు వివశుండ నై యేమియుం దోఁచక కంపస్వేదంబులు బొడమ పుడమిం బడి యున్న నన్నుం జూచి వెన్నుండు బ్రసన్నుం డై యార్తజనాభయదానప్రశస్తం బైనతనదివ్యహస్తంబున నిమురుచు డగ్గరం దిగిచి దేవర యల్లె కరుణాకటాక్షవీక్షణం బెలయించిన నేనును దిలకించి పులకించి యద్దేవదేవుదివ్యావతారంబు లుపలక్షించి దండనమస్కారము లొనర్చి ప్రాంజలితో నాయొపినవిధంబున స్తుతియింపుచు బరమానందంబున నిలువంబడిన, మగుడ నానునయాలాపంబు లొప్ప నయ్యొప్పులకుప్ప నన్నుం జూచి నీవు కృతార్థుండ వైతి, నీ కిష్టం బైనవరంబు గోరు మిచ్చెద నని యాన తిచ్చిన నేనును సంతుష్టాంతరంగుండ నై యిట్లంటి. 30

క. నాజన్మము నీకృపకును
భాజన మై వెలసెఁ గానఁ భవదంఘ్రియుగాం
భోజవిలోకనదశ మా
రాజునకుం జేయు వల దె రాజీవాక్షా! 31

చ. అన విని దేవదేవుఁ డమితాదర మొప్పఁగ నవ్వుతోడ మత్క
గనుఁగొని నీయభీష్ట మొసఁగ న్మది మాకుఁ దలంపు గాన నీ
వనఘగుణాఢ్య యుక్తపరివారముతో నృపుఁ దోడితెమ్ము టం
చనుమతి సేయఁగా నిటకుఁ జయ్యన వచ్చితి మీకుఁ దెల్పఁగన్ 32

తే. మీర లేతెంచి చూచినమీఁదఁ గాని
నీలశైలనివాసునిలీల లెల్లఁ
దేటపడ నేర్చునే? యిట్టిదివ్యనగము
మూఁడులోకంబులందునఁ జూడఁ గలదె. 33

వ. అని యపరిమితంబు లగుతత్తద్విలాసంబు లుపన్యసింపుచున్నయ
క్కుమారుం జూచి సభాజను లందఱు నత్యైశ్వర్యభాజను లగుచు
నితం డివ్విధంబున జగన్నాథునికరుణాకటాక్షవీక్షణప్రసాదసంభాషణం
బులకు యోగ్యుం డయ్యె నెట్టిభాగ్యం బో యని యనేకవిధంబులఁ
గొనియాడుచు వీనివలన రాజన్యుండు కృతార్థుం డయ్యె ననుచు రా
జు విజయంచేయక మానఁడు కావున మనమును బోద మనుచుఁ గో
లాహలంబుగాఁ బలుకుచున్నసమయంబున, నయ్యింద్రద్యుమ్నచం
ద్రుండును సభ్యవ్యవహారములయం దనాపేక్షుం డై తత్క్షణంబ మం
త్రుల రావించి మీర లీరాజ్యభారంబు నిర్వహింపు చుండవలయు
నేమును బోయి వచ్చెద మనిఁ కుమారుం దోడ్కొని యభ్యంతరం
బున కరిగిన దేవు లక్కుమారుం జూచి సమ్మదాశ్రుపూరితలోచనం
బుల డగ్గరం దిగిచి కుశలం బడిగిన నతండు భవదనుగ్రహంబున సు
ఖంబున వచ్చితి నని చెప్పినతదనంతరంబ, భూపతి యతనివలనఁ దన
కుఁ గలిగినపరమోపకారంబు దెలిపి నీనివలన నీలశైలవాసుని సేవిం
చుట కలిగె నని తనప్రయాణంబుఁ జెప్పిన వారునుం దనతోడ న వ
చ్చెద మనిన వల దనుచు సమాధానంబున నివారించి మరల సభాస్థ

లంబునకు వచ్చి స్వామిదర్శనోత్సాహమానసుం డై ప్రియాణభేరీ చ
రువం బంచిన, 34

మ. తతభేరీరవఘూర్ణితాంబుధిచలద్భంగావళీహాస్యసం
గతి జేయంగ వియన్నదీరమణి భూకాంతుం బ్రశంసించి పు
ష్పతతిం జల్లినభంగి ధాత్రిపయి నక్షత్రాళి రాలె న్మహా
ద్భుత మబ్ధిం గలముత్తియంబులు దివిం దోఁతెంచెఁ దారాఖ్యమై.

శా. భూభారం బెడలించి రాజు చనగా భూభృత్పదం బేల నం
చాఖిలంబుగ మందరాదు లమితం బాక్రోశముం జేసిన
ట్లాభేరీరవపూరితోత్కట గుహాత్యంతప్రతిధ్వానముల్
భూభాగాంబరదిగ్వితానములపై మ్రోసెన్ జగద్భీమ మై. 36

వ. ఇట్లు ప్రయాణోన్ముఖుం డగుట విని సమస్తజనంబు లతివ్యాసంగ
మానసు లై వచ్చి రాజుం జూచి దేవా! భవదధీనుల మైనమేము మీా
రలు లేనియీాదేశంబున నిల్వ నోపము మీాతోడన మేమును వచ్చెద
మని విన్నపించిన వారల నందఱ ననునయాలాపంబుల నివారించి యు
భిమతార్థంబు లొసంగి మాహిర్తికదత్తశుభముహూర్తంబునఁ గదలి
సుజనవిధేయుం డయిన యజ్ఞనాభిధేయుండు దనతోడన రా భేరీమృ
దంగాదినాదంబులు బ్రాహ్మణాశీర్వాదనాదంబులు భూనభోంతరాళం
బులు నిండఁ బౌరలోకంబు సమ్మదాశ్రుపూరితవిలోకనంబులఁ జుట్టు
నుం బరివేష్టింప వేత్రహస్తులు సందడి జడియు చుండ మందగమనం
బున ధరాపురందరుండు బహిర్ద్వారంబు దాఁటి సమీాపంబున నుత్తర
భాగంబున నున్న శమనావతి నుత్తరించి తదుపకంఠంబున మనోహరం
బగునారామంబున నివసించి మఱియును 37

సీ. దక్షు లౌసప్తప్రధానవర్గముఁ జూచి
భవ్యభాండాగారపతులఁ జూచి

మణిమయవస్తుసన్మాననీయులఁ జూచి
గజవాజిగోపాలగణముఁ జూచి
యాయుధపరికరాధ్యక్షులఁ గనుఁగొని
పురపరిపాలకోత్కరముఁ జూచి
సత్రిసంరక్షణసమధికారులఁ జూచి
సకలసేనాధిపజనముఁ జూచి
మీర లైకమత్యంబున మెలఁగ వలయుఁ
దత్తదధికారవర్తన దప్ప వలవ
దిచట మే మున్నయట్లు లూహింప వలయు
ననుచు నందఱతోఁ బల్కె నరవరుండు. 38

శా. మదమాతంగచతుస్సహస్రకము భీమామోఘవేగాశ్వముల్
బదివే లుద్ధతశౌర్య లౌభటులు ముప్పైవేలు నుష్ట్రంబు లి
ర్పదివే లాయతచిత్రకంబళకుటీరస్యందనాందోళికల్
ముదమారం బదివేలు రాఁ బనిచె సంపూర్ణప్రమోదాత్ముఁడై. 39

తే. పౌరలోకంబు లెల్ల దుర్వారశోక
వహ్ని బొల్పడ వారల వసుమతీశుఁ
డమితకరుణాకటాక్షవీక్షామృతాప్తి
మహిమ వెలయించి యందఱ మరల జేసె. 40

క. మఱునాఁ డరుణోదయమున
ధరణీశుఁడు వెడలె స్వామిదర్శనమునకై
వరశకునంబులు కని భూ
సురుఁడు న్వేశ్వర వానిఁ జూపుచు నుండన్. 41

వ. చని కతిపయప్రయాణంబుల భూదేవుండు దెలుపుమార్గంబున
వినంబునకుఁ గ్రోశద్వయం బరుగుచుఁ దత్తద్దేశాధిపతు లొసంగినధన

కనకాదిపదార్థంబులు, మణిమయవసుచీనాంబరంబులు నాశీర్వాదంబు సేయ వచ్చినబ్రాహ్మణపరివరుల కొసంగుచుం గ్రమక్రమంబున జనపదంబులు పురంబులు నదీనదస్థలంబులు మహాగిరిగహ్వరంబులు దాంటుచు సింహశరభాదిమస్తమృగంబులం జూచుచు నిట్టిమహాగహనంబున యజ్ఞనార్యంం బొక్కరుం డెట్లు చరియించెనో యని నివ్వెఱంగందుచుం జని యొక్కసంవత్సరంబునకు నీలశైలమహారణ్యంబు సొచ్చి, యం దొక్కసమస్థలంబున బటకుటీరంబులు నిర్మించి యందు యజ్ఞనసహితంబుగా నివాసంబు జేసి యుండె నంత. 42

సీ. ఘనభేరికాహాళఘంటారవంబులు
తతనాగబృంహితధ్వనులు మఱియుఁ
దురగహేషాఘోష లురుతరభటసంఘ
లాలాపజనితకోలాహలంబు
రథనేమినిస్వనబధిరీకృతంబులు
వరపతాకోద్భూతవాతరవము
ప్రాసపట్టిసచక్రపరశుగదాశూల
ముసలకుంతక్షురముద్గరాది
సాధనోజ్వలకాంతులుసందడింప
విని భయంబును గోపంబుఁ బెనఁగ నీల
శైలవాసునికింకరుల్ సౌధశిఖర
భాగముల నెక్కి కనుఁగొని పలికి రపుడు. 43

మ. ఎవఁ డిట్లుగ్రచమూసహాయుఁ డగుచున్ నేతెంచినాఁ డౌర! మా
నవు లెక్కాలమునందు వచ్చి రె జగన్నాథాయనస్థానమున్
చవుకై పోయె నిఁకే మటంచును మహాసంరంభతుంగాంగులై
రవివంశోత్తముసేనపైఁ గదిసి రుగ్రాడంబరప్రక్రియన్. 44

వ. ఇట్లు గదియుసమయంబున రాజేంద్రుండును ధరణీసురుండును బ
టకుటీరంబున స్వామిదర్శనోపాయంబు విచారింపుచుండిరి. తక్కిన సే
నానాయకప్రభృతిభటనికాయంబు యుద్ధంబు సంభవించుట యెఱుం
గక నిశ్చింతను విడిసి యుండి రంత; 45

మ. హరిభక్తుల్ వియదంతరాళ మదృవన్ హర్మ్యాగ్రసంస్థాను లై
శరసంధానవిమోక్షణంబు లరయన్ సామర్థ్యముల్ లేక ఖే
చరు లగ్గింప శరంబు లేసిరి లసజ్జ్యానాదగర్జారవం
బరుదారంగ భటాళిపైఁ గరులపై నశ్వాళిపై వ్రేల్మిడిన్. 46

వ. ఇట్లు చతురంగంబులు వికలాంగంబులు గా నోనేసిన సేనానాయ
కులు భూనాయకునకుం దెల్పిన నతం డరుణితలోచనుం డై యూరకు
న్న వారును గోపోద్రేకంబున వైకుంఠనాయకునిభక్తులపైఁ గవియుట
కోడక బలంబు లాయితంబుఁ జేసి 47

శా. చాపాద్యాయుధహస్తు లై రథికు లశ్వారోహకుల్ వీఁకమైఁ
గోపోద్దీప్తి గడంగి భూరిగుణనిర్ఘోషంబు నిండారఁగాఁ
దూపుల్ వే పరగింప వారును లసద్దోర్దర్పు లై బాణముల్
భూపాలాగ్రణిసేనపై గురిసి రంభోవాహతుల్యంబుగన్. 48

వ. ఇవ్విధంబున నిరువాఁగులును ముహూర్తమాత్రంబు ఘోరంబు
గాఁ బోరి రంత. 49

శా. ప్రాసాదంబుల నున్నవైష్ణవులపై బాణాదు లెన్నేసినన్
గాసింబోయెను వార లేర్పువిలసత్కాండాగ్ని దుర్వార మై
వేసంగిన్ జెనుచిచ్చు కాఱడవి సంవేష్టించిన ట్లుగ్రతన్
భూసంచారుల నొక్క వ్రేల్మిడిని సంపూర్ణాహుతిం జేసినన్. 50

సీ. మఱి హయంబులు మ్రగ్గె మాతంగములు మ్రగ్గె
సుభటాళి యెల్లను జూర్ణ మయ్యెఁ

జాముగాందోళికచ్ఛత్రముల్ నురుమయ్యె;
మణికంకణాదులు మంటఁ గలసె;
ధ్వజపతాకావళి ధరణిగతం బయ్యె;
శిథిలంబు లయ్యెను రథము లెల్ల;
బహుయూథపంబులు పాలయ్యె నేలకు; ధనురాది
సాధనాంతరములు సమసి పోయె;
గురుతరామోఘవైష్ణవశరదవాగ్ని
మానవాధిపువరచమూకాననంబు
నిమిషమాత్రంబులోపల నీఱు జేసె
దైవబలమున కిల నసాధ్యములు గలవె. 51

వ. పదంపడి యవక్రపరాక్రమంబున విజృంభించి నరపతిసేనవారలు ప్రయోగించినశస్త్రాస్త్రంబులు కుజనవిషయం బైననీతివాక్యంబులుం బోలె వ్యర్థంబు లైన సేయునది లేక నిరవశేషంబుగా శాంతిం బొందిన, రాజశేఖరుం డంతయుం జూచి విస్మయభ్రాంతచిత్తుం డై యసహాయశూరుం డయ్యును స్వామిసేవకులపైఁ గోపం దగ దని యూహించి విషాదరోషంబులు ముప్పిరిగొనం దనకు నింతయు నీయజ్ఞనాథముండు చేసె నని తలంచుచుఁ గ్రూరదృష్టి నతనిం జూచి, 52

శా. స్వామిద్రోహి! కృతఘ్న! దుష్ట! కపటస్వాంతుండ! మాయావి వై
స్వామిం జూపెద నంచుఁ జెప్పి యిచట న్సైన్యంబు డాఁగించి యు
ద్దామప్రక్రియ నాదుసైన్య మదయత్వం బొప్పఁ జంపించి నా
వేమందు, న్నిను నమ్మి భంగ పడితి న్విఖ్యాతి మాసెం గటా. 53

వ. అనుటయు, నంత; 54

ఉ. ఆతఁడు భీతి నొంది విలయాంతకుఁ బోలి చరించుచున్నధా
త్రీతలనాథుఁ జూచి, విను దేవర! మజ్జనకాంఘ్రి లెంతయుఁ

నాతల నిల్పి చెప్పెద ననారతము న్నిను దండి బోలె వి
ఖ్యాతి గొనర్చుచుండుటయు యథార్థము ద్రోహము లేదు నాయెడన్,

సీ. నీలశైలాధిపు నిక్కమేఁ జూచితి
నధిపుఁ దోడ్కొని ర మ్మటంట నిజము
స్వామిభక్తులు మహాసంపన్ను లయి యున్న
వారు గాన పరులఁ జేర నీరు
మనసేనలను జూచి మచ్చరులై వచ్చి
తమ కేమొ భయ మంచుఁ దలఁచి యిట్లు
జేసిరి; మన మని చెప్పినఁ జేయరు
మిగుల బద్ధది విను జగతినాథ!
తోను జని వారిఁ గనుఁగొని హితము జెప్పి
దేవదేవుని దర్శించి దివిరి నిన్నుఁ
గొంచుఁ బోయెడివిధ మాచరించి వత్తు
సెలవు దయసేయు మన విని క్షితిపతియును. 56

ఉ. ఇంతఫనించెఁ గాదె యిఁక నేమి యొనర్చెద వన్న; నిద్ధరా
కాంతున కీదురంత మగు కాఱియ దెచ్చినవాఁడ నైతి నీ
వంతఁ దలంగు టెట్లగు నో వారిజలోచన! యాశ్రితావన
స్వాంత! జగత్ప్రభో! యనుచుఁ జయ్యన నేగె వనాంతరావనిన్.

వ. మఱియు ననేకవిధంబులం బలవించుచు జగన్నాథుదివ్యచరణంబు లు మనంబున నిడికొని పదంబులు దొట్రిల గద్గదిక నెలుంగునం బ్రార్థింపుచు నీలశైలంబుఁ జేరం జని సమీపంబున గోపురప్రాకారసౌధంబుల నాయుధహస్తులై యున్న స్వామిసేవకుల దూరంబునం గని, కరంబులు మొగిడ్చి, 58

క. దేవార్చకవరులారా!
నావిజ్ఞాపన వినుండు నాఁడు భవత్సే

వావిధి సలిపినధరణీ
దేవుండను యజ్ఞనాభిధేయుండఁ జూడి. 59

ఉ. నా విని, వైష్ణవోత్తములు నాఁ డిటు వచ్చినయజ్ఞనాధ్యుఁ డా
భూవిభుఁ దోడిదెత్తు నని పోయె నతండును నాతఁ డిప్పుడీ
దేవునిఁ జూడఁగా నరుగుదెంచిరి సు మ్మిది ము న్నెఱుంగ లే
కీవిధమాచరించితిమి! యేమిదలంచున్నో దేవదేవుఁడున్. 60

చ. అనుచు భయంబు నొందుచు, ధరామరుఁ డంతటఁ జేర వచ్చినన్
గనుఁగొని నీవు దెల్పమి నకారణ మిట్లు వధించినార మీ
జనపతిసేన, దీనఁ గడు సంకటపా టగుఁ బుండరీకలో
చనునిమహాగ్రహంబునకుఁ జయ్యనఁ బాత్రుల మైతి మక్కటా! 61

తే. శ్రీజగన్నాథుసత్కృపాభాజనుండ
వైననీ వేగి దర్శించి వసుమతీశు
రాక యెఱిఁగించి మముఁ గృపాలోకనమునఁ
జూచునట్లుగఁ జేయు మోసుభగచరిత. 62

క. అని వారందఱుఁ బలుకఁగ
విని యాతఁడు ధైర్యమహిమ విధికృతమున కే
మనగల దింకను వీరల
ననఁగాఁ బని యే మటంచు నగమున కరిగెన్. 63

వ. ఇ ట్లేగి బ్రాహ్మణుండు భగవంతు నిట్లని వినుతించె. 64

శా. శ్రీకృష్ణాచ్యుత! భక్తపాలన! హరీ! శ్రీనీలశైలాధిపా!
లోకాధ్యక్ష! రమాపతే శ్రితదయాలోలప్రభూ! మాధవా!
పాకారిప్రముఖామరార్చిత! లసత్పంకేజపత్రేక్షణా!
నీకు న్మ్రొక్కెదఁ గావవే కరుణ నిర్ణిద్రప్రభావోదయా! 65

వ. అని యనేకవిధంబులం గొనియాడుచు, సోపానంబుల నెక్కుచుఁ

గ్రమంబున గర్భాలయంబుఁ జొచ్చి పరిచారిక లుపచారంబు సేయు సమయం బగుట స్వామిదర్శనంబున కవసరం బని యతిత్వరితగతిం జని

ఉ. ముద్దులు గుల్కు మోముపయి ముంగురు లల్లలనాడ మేనిపై
దిద్దినమేల్జరీవలువ దిక్కుల కెల్ల మెఱుంగు వెట్టఁబె
న్నిద్దపుటోరజూపు లొగి నీటు దనర్ప నొయార మొప్పఁగా
గద్దియ నున్నస్వామి పదకంజసమీపము జేరి యాతఁడున్. 67

వ. సర్వాంగాలింగితోర్వీతలంబగుదండనమస్కారంబులు చేసి నిటల తటకరపుటుం డై, 68

శా. దేవా! దేవరయాజ్ఞ గైకొని క్వచిత్సేనాళితో రాజు మీ
దేవారణ్యసమీపభూమి నిలువం దీవ్రించుగా నర్చకుల్
నై వైద్యంచు బలంబు నెల్లను శరవ్రాతంబుల న్ద్రుంచినా
రీవైచిత్రికి నేన కారణమ నైతే మందు నింకం గటా! 69

క. కడు నిద్రి జెందువానిని
బెడిదముగా నరుసుమాడ్కిఁ బ్రియమున మొక్కన్
గడువడిఁ జేతులు నరకిన
వసువున మిముఁ జూడ వచ్చువారికి నయ్యెన్. 70

వ. జనకసమానుం డైనరాజున కుపకారంబు సేయువాఁడ నై పూని భవదనుజ్ఞఁ గైకొని యిచ్చుటకుం దోడ్కొని వచ్చినయెడ నిట్టిదురవస్థ వచ్చుటంజేసి కృతఘ్నుండ నని రాజుచేత దూషింపఁబడితి నింకఁ జీవనంబువలనిభ్రాంతి వదలి యుష్మదధీనుండ నైతి నని విన్నవించిన జగద్రక్షణధురీణుం డై నశ్రీయనార్యాయణుండు కరుణాలోకనంబున వెలువకు మనుచు నతని ననునయించి, యర్చకులం బిలిపించి, 71

క. మముఁ జూడ వచ్చి యుట వి
శ్రమ మొందినవారి మీఁదు శస్త్రాస్త్రములన్,

విమతులఁ బోలె వధించిరి
శమదమహీనాత్మకులరు చర్చింపంగన్. 72

క. కోపము పాపము గాదే
పాపమునన్ బ్రహ్మహత్య పాటిల కున్నే
మాపాత్తు గోరుమీారలు
యీాపగిదిన్ఁ జేసినార లిది న్యాయంబే. 73

తే. అనుచుఁ గోపాస్యుఁ డగుచు న్ద్విట్లాన తిడఁగ
వార లంగంబు లెల్లను వణఁకు చుండ
నిలచి చేతులు ముకుళించి నీలశైల
నిలయ! కరుణింపు పాపకర్మలను మమ్ము. 74

వ. అని వేడిన మీారలింక నకార్యంబు జేసిన సహింప నని భయం
బు జెప్పి యిందద్రిద్యుమ్నుం డసహాయశూరుం డయ్యును మద్భక్తుం
డగుట మీా రొనర్చినదుష్కార్యంబు సహించెం గావునను యీాబ్రాహ్మ
ణుఁడు తనకు ద్రోహం బొనర్చె నని భయాతురుం డగు చున్నవాఁడు
గావున వీరలం గటాక్షించితి మదీయపాదంబులయందు మందాకిని
నివసించి యుండుఁ దజ్జలంబులు గైకొని పోయి మీాచేతవధియింపఁ
బడినసర్వసేనలయం దభిషేకించునది దానం జేసి సకలంబును సంప
న్నం బగు నని యాన తిచ్చిన ముదంబునం బొంగుచు, 57

చ. కలశము లంఘ్రిపంకజనఖాగ్రసమీాపమునందు నుంచినన్
జలజలమంచుఁ దీర్థ మొుగి జారెను; వారలు గొంచుఁ బోయి ని
శ్చలమతి స్నానపానములు సల్పుచు శీఘ్రము గొంతతీర్థము
న్జిలికిరి రాజుసేనపయి సిక్తముగా సకలాంగకంబులన్. 76

తే. అచ్యుతాంఘ్రిపయోవగాహనముచేత
రథికసారథిగజవాజిరథపదాతి

కేతుతూణీరశరధనుర్జ్యాతపత్ర
తతులు యెప్పటిభంగిని ధరణిఁ బొలిచె. 77

చ. నరులు పయోదముల్; కనకనవ్యమణిప్రతిభోరుభూషణో
త్కరము తటిల్లతల్; వచనగర్జలు; చాపము లింద్రచాపముల్;
తురగశతాంగకేతువులు తోయము; గాఁగను, భూసురేంద్రుఁ డా
ధరణిపబర్హణంబున కుధార్తమనోముద మావహించినన్. 78

వ. ఇట్లమానుషకృత్యం బగుకార్యంబు జూచి రాజేంద్రుఁ డత్యద్భు
తమానసుం డై యజ్ఞనార్యునియం దింతదైవానుగ్రహం బొప్పనే
యనుచు నుండె నంత నయ్యెడ భూసురుండు. 79

క. గోవింద! భక్తవరదా!
మీావిమలాపాంగదృష్టి మేదినిపతిసే
నావళి బ్రదికెను, యిఁక నా
భూవరుఁడున్ మిమ్ముఁ జూచుపొలు పెట్లగునో? 80

మ. అని ప్రార్థించిన మందహాసకలితాస్యాంభోజు డై మంచిదే
విను మాయాజ్ఞను తోడి తెచ్చితివి పృథ్వీనాథు సుశ్లోకు; గా
వున దోడ్కొం చిట రమ్ము మద్విరుదు లింపొందంగ నిప్పింతు నే
నని ఛేరీసితఛత్రచామరము లానందంబుతోఁ బంపినన్. 81

వ. వారితో ధరామరుండును నర్చకగణంబును మృదంగాదిమంగళ
వాద్యఘోషంబుతో రాజసన్నిధికి వచ్చు చున్నం గని, 82

క. నాతండ్రీ యజ్ఞనార్యా!
యాతురతం దూఱితినాఁడ; హా! తప్పు, దయా
న్వితుఁడ వై క్షమియింపుము
పాతకుఁడన్ సుజనహృదయపరిభూతకుఁడన్. 83

మ. అనుచుం గేలు మొగిడ్చి భూసురుని గాఢాలింగనం బొప్పఁజే
సిన నిర్దోషి నటంచు మీామదికి వోఁచెం జాలు భూమీశ! యం

చు నుతింపం గని విష్ణుభక్తులు మహాచోద్యంబుగాఁ జూచినా
రనఘుం భూరిభుజాబలప్రవరు నిందద్యుమ్న రాజేంద్రునిన్. 84

వ. ఇట్లు చూచి యితండు రాజచక్రవర్తియు గుణోత్తరుండు నగు
ననుచుఁదాము చేసినయసంగతంబునకు లజ్జించుచు సవినయంబుగా ని
ట్లని విన్నవించిరి. 85

మ. ధరణీనాథకులావతంస విను మిద్ధాత్రీధరాధ్యక్షుఁడా
దర మొప్పంగఁ దోడితెం డనుచు నాత్మాయత్తమైనట్టియా
బిరుదు ల్మీకు నొసంగ మమ్ముఁ బనిచెన్ బృథ్వీశ! వే రాగదే!
శరణత్రాణపరాయణుం గనుము నిశ్శంకీకృతాత్ముండవై. 86

వ. అని పలికినవచనంబులు కర్ణరసాయనంబై సంతోషించుచు దేవ
నిచ్ఛత్రచామరాది చిహ్నంబులకు నమస్కరించి కిరీటాంగదాదికంబు
లగుతనవిభూషణంబు లూడ్చి వినీతవేషుండై నీలశైలంబున కభిము
ఖంబుగాఁ గరతలంబులు శిరంబునం గదియించి జగన్నాథుఁ దలంచు
చుఁ జనుసమయంబున, 87

లయగ్రాహి.

కమ్మనిలతాంతముల తుమ్మెదలగానము ఖ
గమ్ములనినాదముల నిమ్ము లగుభూజా
తమ్ములను తమ్ముల హితమ్మగుమృగమ్ముల వ
నమ్ముల జలమ్ముల తిరమ్మయినకాసా
రమ్ములను సాధనికరమ్ములకుటీరనివ
హమ్ములను గోపురగణమ్ములను సోపా
నమ్ములఁ గనుం గొని మనమ్మలరి రాజు విన
యమ్మునను నేగె దను దెమ్మెరలు నీవన్. 88

వ. ఇట్లు పోవుచు సంతోషితాంతరంగుండై పొంగుచు స్వాప్నదర్శ

నోత్సాహంబున నిమేషంబు యుగపరిమాణంబుగాఁ దలంచుచు వై
ష్ణవోపదిష్టమార్గంబున నీలశైలసోపానజాలంబు జాలంబు సేయక ని
ర్గమించి దానియౌన్నత్యంబునకు కనకమణిస్థగితంబు లగువప్రగోపుర
ప్రాకారశిఖరంబులకు నబ్బురం బందుచు, నొబ్బనం బోయి యం
తకుమున్న కనకకవాటంబును తదంతస్థితయవనికాపటంబును దెరల్చి
యుద్ఘాటం జేసి పురుషోత్తమునిదివ్యవిగ్రహంబు దూరంబున నున్న
ధ్వజస్తంభసమీపంబునకుఁ బొడసూపిన రాజన్యుండుఁ గనుంగొని, 89

సీ. ఘనకిరీటాంగదకనకకుండలకాంతి
కకుబంతరంబుల గడలుకొనఁగ
నేత్రముల్ మిరుమిట్లు నెఱయింపఁ జూడలే
కద్భుతం బంది భూకాంతుఁ డపుడు
దిగ్భ్రమ మొందిన దివిరి యజ్ఞన దెల్పఁ
దెలిసి రాజన్యుండు దేవదేవు,
దివ్యమంగళదేహు, దేవేంద్రవందితుఁ,
బరమయోగీంద్రసంభావనీయుఁ,
జూచి తిలకించి పులకించి చోద్య మంది
నాదుజన్మంబు సఫలత నొందె ననుచు
ముదముతో మత సాష్టాంగ మొనరఁ జేసి
కన్ను లారంగఁ జూచె లోకాధినాథు. 90

వ. ఇట్లు చూచి చేతులు మొగిడ్చి, 91

క. భో భో! నీలనగాధిప!
భో భో! భక్తావనపరితోషితహృదయా!
భో! భోగితల్పశయనా!
భో భో! దివ్యావతార! భో! గోవిందా! 92

క. శ్రీభూనీలాయువతీమ
నోభూషితదివ్యరూపనుతసువిధేయా!
లోభమదమోహదూరా!
శోభాజితనీలజలదసుందరదేహా! 93

సీ. సన్నుతామరజాల! సద్గుణసంశీల!
పతగరాడ్వాహ! తుభ్యం నమోస్తు;
నీరదనిభగాత్ర! నారదసంస్తోత్ర!
పన్నగతల్ప! తుభ్యం నమోస్తు;
చక్రాయుధోపేత! సరసిజదళనేత్ర!
పాపసంహార! తుభ్యం నమోస్తు;
నీలనగాధ్యక్ష! నిరుపమమణివక్ష!
పావనాకార! తుభ్యం నమోస్తు;
నిర్గుణాద్వైతసువిచార! నిర్వికార!
జలధిగంభీర! మందరాచలసుధీర!
త్రిజగదారాధితాకార! కుజనదూర!
యవ్యయానందరూప! తుభ్యం నమోస్తు; 94

క. వరమత్స్యకమఠకిటినర
హరివామనభృగుకులోద్భవాసితహేమాం
బరధరశుభావతారము
లరుదుగ ధరియించి తో విలాసప్రౌఢిన్. 95

ఉ. విస్మయమైన మీమహిమ వేయిముఖంబులు గల్గు శేషుడై
నా స్మరియింప లేడనఁగ నా వశమే మిము సన్నుతింప నా
కస్మికమైన మీకరుణ గల్గెఁ బురాకృతసత్కృతిం గృతా
ర్థోస్మి యటంచు జాగిలె విధూతకళంకుని పాదసన్నిధిన్. 96

వ. ఇట్లిందిరాధ్యక్షుం డనేకవిధంబులం గొనియాడుచున్నం గనుం
గొని జగతీశ్వరుం డగణితకరుణావిలోకనంబుల నవలోకించి గంభీరమ
ధురస్వనంబున నిట్లని యానతిచ్చె. 97

శా. భూపశ్రేష్ఠ! మదంశసంభవుడవుం బుణ్యప్రభావుండవున్;
నీపై మాకృప గల్గు టబ్బురమె వాణీశాదులే దైవమ
ద్రూపప్రాప్తులు గారు నీకు దొరకెన్ రూఢంబుగా నమ్ముమీ
బాపం డచ్యుతసద్గుణోత్తరుండుగా భావింపు మెల్లప్పుడున్. 98

వ. అని మఱియును, 99

క. కోరినకోరిక లిచ్చెద
భూరిభుజా కోరు మనిన పులకితతనుండు
ద్ధారితబాష్పవిలోచనుం
డై రా జిట్లనియె విను మహాత్ముం డనుచున్. 100

శా. స్వామీ విన్నప మాలకింపు; భుజగవ్యాఘ్రోగ్రసంచారితో
ద్దామారణ్యనివాసులై నమిముం సందర్శింపంగా లేరు మీ
రామోదించిన, దేవ! కోవెలలు నిర్మాణంబు సేయింతు ని
స్సీమానుగ్రహ మొప్ప మాభువికి వేంచేయుం గటాక్షింపవే. 101

క. నాకోరిక దయచేయుము
వైకుంఠనివాస! యనిన వసుధేశునితో
లోకము కలిసంప్రాప్త
ప్రాకట్యదశ నొందెఁ గాన రా నచ్చటికిన్. 102

తే. నీవు వచ్చిన గొనిపోదు దేవలోక
మన విషణ్ణతనొంది రమాధినాథు
పాదముల వ్రాలి ప్రార్థించె బహువిధముల
నాదుకోర్కె యొసంగు మనాథనాథ! 103

మ. అని ప్రార్థించిన నీలశైలనిలయుం డత్యానుకంపామతిన్
జననాథాగ్రణి నీహితం బొసఁగితిన్ సమ్మోదముం బొంది వే
జని దేవాలయముల్ ఘటింపు మట నిస్సందేహ మొప్పంగ భూ
జను లైక్యంబున మంత్రిసాదముఁ గొనన్ సారూప్యతం జేర్చెదన్

వ. అని మఱియును దేవళంబులు నిర్మాణంబు సేయింపుము కొన్నిది
నంబులకు మూఁడుదారువులు సముద్రంబున నచ్చటికి వచ్చు వానిని
విగ్రహంబు లొనర్చి నీవు బ్రహ్మలోకంబునకుఁ బోయి మదనుశాస
నంబుఁ జెప్పిన నతండును సురగణంబుతో వచ్చి విగ్రహప్రతిష్ఠఁ జేసి
జగన్నాయకబలభద్రసుభద్రావిధేయంబులు విధేయంబుఁ జేసి బ్రహ్మ
రుద్రాదిదేవతలతో జగన్నాథంబునఁ దీర్థప్రసాదంబులు గొను నిదియ
బౌద్ధావతారం బనం బరగు నీవు కృతార్థుండ వగుదు వనిశ్రీమన్నారా
యణుం డానతిచ్చిన; 105

మ. భగవద్వాగమృతంబుఁ గర్ణయుగళిం బానంబుఁ గావించి యా
జగతీనాథుఁ డఖండమోదమున నాజన్మంబు సార్థక్యతన్
బొగ డొందెన్ సకలామరావళియు నంభోజాతపత్రేక్షణుం
డగఁ జూడంగ నశక్యు లట్టిహరి నాదాస్యంబుఁ గై చేసెనే! 106

క. నాపూర్వపుణ్యవశమున
నీపగిదిని నీలశైలనిలయునికరుణా
లాపస్వరూపభాజన
తాపరిణతి నొందితిం గృతార్థుఁడ నైతిన్. 107

వ. అని పరమానందంబున మునుంగుచు జగన్నాథుచరణంబులకు సా
ష్టాంగదండనమస్కారంబు లొనర్చుచు నిలువంబడి యుండె నంత
యజ్ఞనాభిధేయుండు విధేయుం డై ప్రాంజలి యగుచు స్వామి సన్ని
ధానంబునకు వచ్చి దేవా దాసుఁడ ననిన మందస్మితసుందరవదనార

విందుం డగుచు రాజునకు నతనిం జూపి వీఁడు పరమభాగవతోత్తముం డు; నీపుణ్యంబునంబుత్రప్రాయుం డయ్యె; వీనివలన నీవు కృతార్థుండ వయితి, కావున భక్తిశ్రద్ధావిధేయుండ వై యితని నుపాసించు చుం డుము, వీనికి నక్కన్యం బరిణయంబు సేయింపుము; పుత్రపౌత్రవం తుండై వర్ధిల్లం గలవాఁడు, భవిష్యత్కాలంబున కితని కుపకారం బు సేయం గలవార మని రాజున కొప్పించి మీర లిద్దఱు దేశంబున కరుగ వలయు; నేనును వైకుంఠంబునకుఁ బోవం దలంచి నార మని యాన తిచ్చిన విని మనంబులం గుందు చుండి రంత గోవిందసేవకులు స్వామీ! మా కేమి వెరవు మేమును దోడన వచ్చెద మని ప్రార్థించి న మీరు భూలోకంబున శ్రీజగన్నాథక్షేత్రంబున నుత్తరదేశస్థు ల నం బరఁగిన యోఢ్రబ్రాహ్మణప్రీతిచేతఁ బ్రసాదసేవ లొనరింపు చుం డం గలవారు గాన నీయజ్ఞనచేత యథావిధిపూర్వకంబుగా నుపనయ నవివాహాదికంబులు నిర్వర్తింపుచు మీమీగోత్రభేదంబు లరసి సం బంధము లొనర్చు చుండం గల వారలనియును మీరు బ్రాహ్మణ కులాచారంబుఁ దప్పి నిష్టైతుకంబు దుర్వృత్తిచే నింద్రద్యుమ్నుని చతు రంగసేనల నాయుధహస్తు లై వధియించిరి కావున మీర లిట్టిబ్రాహ్మ ణత్వంబు నొందవలసె ననియును నచిరకాలంబున జగన్నాథంబున మద్దర్శనంబు సంభవించు ననియు నానతిచ్చి యాక్షణం బ భగవంతుం డంతర్ధానంబు నొందె నాసమయంబున; 108

చ. వరమునిసంఘ మెల్ల భగవంతు నుతించిరి; దేవదుందుభుల్
మొరసెను; దేవత ల్కుసుమముల్ గురిపించిరి యప్సరోజనం
బరుదుగ నాడెఁ; బాడిరి వియచ్చరకిన్నరపన్నగాంగనల్
కర మనురక్తి దేవుఁడు జగత్ప్రభుఁ డేగుటఁజే న్ముదంబునన్. 109

వ. అట్లు దేవుం డంతర్ధానంబు నొందిన నింద్రద్యుమ్నుండును యజ్ఞ

నాఖ్యుండును నర్చకగణంబును జింతాక్రాంతు లై యున్నం గని, యాపన్నరక్షకుం డాకాశవాణీరూపంబు గా ననునయించినం, దేలి, శైలంబు నిర్గమించి కొన్నిదినంబు లప్పురంబున నివసించి యజ్ఞనకు స్వామ్యనుజ్ఞప్రకారంబున నక్కన్యాశిరోమణిం బాణిగ్రహణంబు సేయించి వధూసమేతంబుగా నతనిం దోడ్కొని యర్చకుల నతివినయ వాక్యంబుల సంభావించి మీర లిందు యుండుం డింక జగన్నాథుండు విజయము చేయక మున్న మీర లచ్చటికి రావలయు నని చెప్పి వారి వీడ్కొని కదలి నిజసేనాసముదయంబుతోఁ గతిపయప్రయాణంబులు గడచి యొుమాసంబులకు నిజపురంబుఁ బ్రవేశించి సకలపౌరజనబంధుజనసేవ్యమానుం డై దేవులం జూచి తనవృత్తాంతంబును యజ్ఞనవలనఁ దనకు నైనయుపకృత్యంబును స్వామిదర్శనసంభాషణాదికంబులును సమస్తంబును నిరస్తసంశయంబుగాఁ దెల్పి యెుప్పటియట్ల రాజ్యభారంబు దనయందు నిడుకొని తదేకాగ్రాయత్తచిత్తంబున, 110

చ. అవిరళ మైన దేవగహనాంతర మంతయుబా గొనర్చుచుఁ
భువిఁ గలవిశ్వకర్మకులపుంగవులం బిలిపించి యుద్ధరా
ధవు డలనీలశైలము విదారణ చేసుక వచ్చి వానితో
న విరచియించె గోపురము లాలయముల్ బహువప్రజాలముల్. 111

సీ. కనకలిప్తశిలావిఘట్టితోన్నతవప్ర
దీధితుల్ దెస లెల్ల దీటు కొనఁగ
మణిహేమగుంభితమంటపాభ్యంతర
గేహకాంతులు తపనుఁ గ్రేణి సేయ
గురుతరేందూపలగోపురప్రాకార
ధవళకాంతులు తళతళలు చూప
హరినీలమణిజాలహర్మ్యాగ్రసోపాన
వజ్రముల్ తారాఖ్య వరలు చుండఁ

బగలు రే యిది యని నిరూపణము లేక
దివ్యమణిహేమరత్న దేదీప్యమాన
మై వెలుంగ నిర్మించెను మహితకీర్తి
సన్నికరమూర్తి రాజన్యచక్రవర్తి. 112

సీ. స్వామ్యర్చకాగారసన్నివేశంబులు,
వేశ్మాంతరాళసంవేదికలును,
వేదికావినిబద్ధ విధుశిలాజాలంబు,
జాలాంతరిత భూరిసౌధములును,
సౌధాంతరోద్దీర్ణ జలయంత్రకూపంబు,
లంబుప్రపూరితహ్రదవరములు,
వరఘంటికానాదవైమానికంబులు,
మానితాగణ్యహేమాంబరములు,
కరము రచియింపఁ జేసి యద్ధరణివిభుఁడు
కనకమణిగణవస్తుగోధనవితాన
తైలతండులఘృతవస్త్రధాన్యచయము
లెల్లఁ దెప్పించె భూజను లుల్లసిల్ల. 113

సీ. కోశశాలలు, మహాఘోటకశాలలు,
సత్రశాలలు, వప్రశాల, లాస్య
శాలలు, వాహనశాలలు, మాతంగ
శాలలు, స్యందనశాల, లెలమి
పణ్యశాలలు, భేరీపటహకాహళతాళ
మర్దళశాలలు, మహితభంగి
నతులచందనశాల, లగరుకస్తూరికా
ఘనసారశాలలు, ఘనముగాను

మఱియు కోనేళ్లు, కూపముల్, మందసములు,
చంపకాశోకమందారసరళజాజి
వకుళపున్నాగమల్లికావనచయంబు,
దలఁచి కంతట సిద్ధపదార్థములుగఁ
జేసె నారాజచంద్రుఁ డాజ్ఞాసమృద్ధి. 114

మ. అలదేవాలయవప్రగోపురమణిప్రాకారసౌధాంతరో
జ్జ్వలచిత్రాకృతు లింపొనర్చె; నిది శ్రీవైకుంఠమం చాత్మ ని
శ్చలభక్తిన్ రమణీసమేతు లగుచుం స్వామిం విలోకింపగాఁ
బలభేదిప్రముఖామరాళి యచటం బ్రార్థింపుచున్నారనం. 115

వ. ఇట్లఖండభూమండలాధిపతి యగునద్ధరాఖండలుండు బ్రహ్మాండనాయకుండు నేంచేయు ననుతలంపున దత్ప్రతిష్ఠ యొనర్పుట కై యివ్విధంబున దేవాలయాదికంబుల నాయితంబులు చేసుకొని శ్రీమన్నారాయణుని దివ్యావతారకారణంబు లగుదారువుల రాకకు నిరీక్షించుచు నెట్లగునో యని వితర్కించుచు డోలాయమానమానసుండై యుండె నంత నొక్కనాఁడు, 116

ఉ. భూవియదంతరాళములు భోరుకొన న్విలయోగ్రభైరవా
రావము బోలె నొక్కయపరాత్రి జనావళి కద్భుతంబు భీ
తావహ మౌచు భూరినినదంబు జెలంగిన రాజు దొట్టి పౌ
రావళియున్ గలంగె నహహా; యిది యేమొకొ యంచు నెంతయున్.

వ. ఇట్లతిదారుణంబైన నినదంబు విని భూకాంతుం డతికుతూహలస్వాంతుండై సమస్తజనంబులతోఁ గరదీపికాసహస్రంబులు వెలయ పురంబు వెలువడి శబ్దంబు వట్టి సముద్రభాగంబున నగుట యోజించి ధైర్యశాలు రగుకాలరులం బిల్పించి మీర లంబుధి కడ కరిగి మహోన్నతం బగు ధ్వని విశేషంబునకుఁ గారణంబుఁ గనుఁగొని రం డని

నియోగించిన వారును దీపికాకలాపంబులతోఁ దరణిసదుపాయంబుల సముద్రంబునకుం బోయి తద్వృత్తాంతం బంతయుఁ బరికించి జగతీవరు సమీపంబున కతిత్వరితంబుగా వచ్చి వార లి ట్లనిరి. 118

క. ఓరాజ! యేమి చెప్పుదు
ఘోరయ జలరాశితటసమావృతమగుచుఁ
దారుత్రయ మేతెంచెను
భూరిమహారావదళితభూభాగంబై. 119

ఉ. ఈశుభవార్త దెల్పుటకు నెంతయు వేడుక వచ్చినార ము
ర్వీశ! యుగంబ నాత డతివిస్మయ మందుచు విష్ణుమూర్తి వేం
చేసె మహాత్ము డెంతయును జెప్పినయట్టులు సల్పె నౌర! నే
జేసినపుణ్యముల్ సుగతిఁ జెందెఁ గృతార్థుడ నైతి నెంతయున్.

వ. అని యి ట్లనేకవిధంబులం గొనియాడుచు నానిశాశేషం బెట్టకేలకు నిర్గమించి మఱునాఁ డరుణోదయసమయంబున దారుత్రియంబు తీరంబుఁ జేరె నని చారులవలనం గూడ విని సవినయంబుగా సకలజనసమన్వితుం డై యచ్చటికిం జని దారుదర్శనం బొనర్చి యత్యాశ్చర్యసాగరంబునం దేలుచు గంధపుష్పాక్షతాదిపూజాద్రివ్యంబుల దారవ్వర్చనంబుఁ జేసి ప్రదక్షిణనమస్కారంబులు చేసి బ్రాహ్మణుల కభీష్టదానంబుల నొసంగి పట్టణపరిపాలకులం బిలిచి దారువులు దేవాలయంబు జేరం గొని రమ్మని యాజ్ఞాపించిన వల్లె యని వారు తత్ప్రియత్నంబున నుండ నంత నయ్యింద్రద్యుమ్నుండును బురంబుఁ బ్రవేశించె; పదంపడి. 121

క. గురుతరశకటశతంబుల
తురగంబులఁ బూన్చి భటులఁడు దోడ్కొని యాగో
పురములు దరిపరువుల ఖే
చరతరువులఁ జేర్చె మానసపట్కంబునకున్. 122

వ. ఇట్లు చేరినదారువులు రాజసునాసీరుండు చూచి, యివి భగవద్వి గ్రహంబులొనర్చుట దుస్తరంబుగాఁ దోచు చున్నదైననుఁ బ్రియత్నంబుఁ జేసెద; శ్రీజగన్నాథుకరుణావశంబున సఫలం బయ్యెడుం గా కేమి యని ధైర్యంబున, 123

మ. బహునైపుణ్యము గల్గుబత్తులను భూపాలుండు పిల్పించి వి గ్రహము ల్జేసినవారి కిష్టధనముల్ గ్రామంబులు న్వస్తువుల్ బహుమానంబులు సేతు నన్న విని యప్పంచాణు లోహో! మహా గహనం బే యని పోయి చూచిరి తరుస్కంధంబు లంతంతటన్.

మ: కమనీయోన్నతవిశ్రుతంబుల లసద్గంధోరుశోభాఘుమం ఘుమితోద్గారితరక్తపూరములచే ఘూర్ణిల్లుదారుత్రయం బమితాశ్చర్యధురీణులై బలసి యాద్యంతంబు వీక్షించి యా యమరుల్జేయఁగ లేరు మానవుల కాహా శక్యమే చేయఁగన్. 125

చ. అని పరికించి వచ్చి వినయంబున నాత్మనిఁ జూచి యోదయా వననిధి! దారువుల్ గని యువారితభక్తి నమస్కరించి నా మనఘుండు విశ్వకర్మసురమాన్యుఁడు జేయునో గాని, మావశం బనఁదగు నయ్య!యంచు భయమారఁగఁ బల్కిరి వార లందఱున్.

వ. ఇట్లు చెప్పిన మానవేశ్వరుండు చింతావిలమానసుండగుచు వార లఁ బోవం బనిచి మంత్రులరావించి విగ్రహనిర్మాణసమగ్రులెవ్వ రివ్వసుంధరం గానంబడ రిక్కార్యం బెట్లు నిర్వహించెదమింక దీని కుపాయాంతరం బాలోచింప వలయు ననిన వారు దూరదృష్టిశ్రవణో హాపోహసమర్థులు గావున మనంబునం దలపోసి యేకవాక్యంబుగా నిట్లని విన్నవించిరి. 127

ఉ. భూపలలామ! యోసుగుణపుంజ! భవత్సుకృతాప్తిచే దయా లాపకలాపుఁ డాప్రభు విలాస్థలి కి ట్లరుదెంచెఁ గావునన్

రూపులు సేయ నొక్కని నిరూపణ సేయ దలంచు గాత చిం
తాపరితాప మేటికి యథాస్థితి నుండుట మేలు చూడఁగన్. 128

వ. అని చెప్పిన మంత్రివాక్యంబులు సభక్తితాత్పర్యంబునం గొని యాడి భగవంతుని చరణకమలంబులఁ దలంచుచుఁ బరమనియతి నుండె నంత నొక్కనాఁడు; 129

చ. ఒకరుఁడు విశ్వకృత్కులసముద్భవుఁ డచ్చటి కేఁగుదెంచి తా
వికవిక నవ్వుచున్ దిరుగ వేగులవా గది చూచి భూమినా
యకునకుఁ దెల్పినన్ బుధసమన్వితుఁడై చనుదెంచి యాతనిన్
బ్రకటజరానిపీడ్యపరిభావితుఁ భూరికృశాంగుఁ జూచుచున్. 130

ఉ. కాఁపుర మెద్ది? జన్మమున కన్నాత నొందు కులం బ దెద్ది? యు
ద్దీపితనామవర్ణక మ దెద్ది? వచింపు మటన్న నాతఁడా
భూపతిఁ జూచి కాఁపురము పొల్పుగ హేమగిరిందఱి, మేను కా
సీపనివాఁడ పేరు విను సిద్ధుఁడ వచ్చితి మిమ్ముఁ జూడఁగన్. 131

గీ. దారువిగ్రహములు సేయ దలఁచి మీర
లుంట విని వచ్చినాఁడ మీ రొప్పి రేని
విగ్రహంబు లొనర్తు సుర్వీతలేశ!
శిల్పనిపుణత కమకులు జెలఁగు నట్లు. 132

వ. జగదీశ్వరుండు మీయందలి కరుణాతిరేకంబున దారురూపంబుగా నీలోకంబున వెలయుటకు విజయము చేసినాఁ డివి దేవదారువులు; ఖండించిన రక్తంబు ప్రసరించు; లోకసాధారణులచేత నిర్మింపఁబడ నేరవు; మంత్రిసామర్థ్యంబునం గాని, తాంత్రికంబునఁ గావు; స్వామి కటాక్షంబునఁ దద్విధానసామర్థ్యంబు నాకుం గలదు కావున మీరలు విచారింపవల దనుచుం డని యనేకవిధంబులం బలికిన విని యవనీ శుం డతిసమ్మదాయత్తచిత్తుం డై యిట్లని వితర్కించి, 133

ఉ. అక్కజ మయ్యెడు న్దగ మహాత్ముఁడు గాని స్వరూపడంబముల్
పెక్కులు లే వితండు గనుపించడు గాక యమానుషాకృతిన్
చిక్కనిపేర్మి నాహరియె చెచ్చెర వీనిని బంపినాఁడు గా
నిక్క మటంచుఁ జూచి యవనీశుఁడు వల్కె ముదం బెలర్పఁగన్.

క. ఓ! విశ్వకర్మ నీ విటు
లావిర్భవ మైతి మత్పురార్జితసుకృతిన్
దైవాకృతు లొనరింతు న
నే వాక్యము లమృతపాననిభ మై వెలసెన్. 135

ఉ కావున విగ్రహంబు లఖర్వమతిన్ రచియింపు మంచు సం
భావన సేయగా నతఁడు పార్థివుతోఁ బదరెండురాత్రు లిం
దే వసియించెద న్బరులదృష్టి కగోచరవృత్తి తోడ నీ
వీవిధమంతయు న్బహువివేకముతోఁ బరికింప గాఁదగున్. 136

వ. అని మఱియును బని సేయు నప్పుడు దారుఖండనాదికంబునకు
మీ సహాయంబుఁ గోర నే నొక్కరుండ నిర్వహింతు మీరునుఁ బౌర
జనం బెవ్వరును ద్వాదశదినంబులు నను బరీక్షింప కుండ వలయుఁ
లోపం బైన నాకు నెపంబు లే దీశ్వరానుగ్రహం బిట్టి దని తెల్పిన
నతఁ డతిసంభ్రమంబుతోఁ బౌరజానపదసచివపురోహితభటవందిమా
గధాదిజనంబుల రావించి వారలతో సవినయంబు గా నిట్లనియె. 137

ద్వి. హితులార సుగుణసంయుతులార మీరు
నాదువిజ్ఞాపన మోదంబుతోడ
విన రయ్య చెప్పెద విశదంబుగాను
మనయజ్ఞనార్యుండు మహితధైర్యుండు
దేశంబు లెల్లనుఁ దిమ్మరు చుండి
నీలాచలాగారు నిగమసంచారు

కోమలఘనగాత్రుఁ గువలయనేత్రు
నారాయణస్వామి నాగారిగామి
సేవించి భాషించి సేమముతోడ
వచ్చి మా కేతెంప వారనిభక్తిఁ
గతిపయసేనతోఁ గదలి మే మచటి
కేతెంచి యుండంగఁ గేశవార్చకులు
కోపించి తాకిరి కోయనివారు
మనసేన లన్నియు మర్దించి రంత
యజ్ఞన చేసిన యపకారమనుచుఁ
దూలనాడితి నేను దోష మానసక
నాతెఁచు ఖిన్నుఁడై నగమున కేగి
స్వామికటాక్షవీక్షామృతావాప్తి
నెసఁగి సేనల నెల్ల నెప్పటియట్ల
జీవింపఁ జేయుచు శీఘ్రంబు గాను
స్వామ్యర్చకులచేత శైలాగ్రమునకుఁ
దోడి తెప్పించినఁ దోయజనేత్రు
దివ్యావతారంబు దేదీప్యమాన
కాంతులఁ బెను పొందు కౌస్తుభానేక
భూషణోజ్వలుఁ డగు పుణ్యాత్ముఁ జూచి
వినుతించి భక్తిచే వినతుం డనగుచుఁ
బ్రార్థించి తిట్లని పరమాప్తులార! 138

శా. స్వామీ! విన్నప మాలకించు భుజగవ్యాఘ్రోగ్రసంచారితో
ద్దామారణ్యము దుర్గమిం బిది మిముం దర్శింపఁగా లేము మీ
రామోదించితి రేనిఁ గోవెలలు నిర్మాణంబు సేయింతు ని
స్సీమానుగ్రహ మొప్ప మాభువికి వేంచేయం గటాక్షింపవే? 139

మ. అని ప్రార్థించిన నీలశైలనిలయుం డత్యానుకంపామతిన్
జననాథాగ్రణీ! నీహితం బొసఁగితిన్ సమ్మోదముం బొందివే
జని దేవాలయము ఘటింపు మట నిస్సందేహ మొప్పంగ భూ
జను లైక్యంబున మత్ప్రసాదము గొన న్నానాస్పృశ్యత జ్జేసెదన్. 140

వ. అని యానతిచ్చిన నేనును బ్రహ్మానందభరితుండ నై వీడ్కొని యజ్ఞసం దోడ్కొని యిటకు వచ్చి దేవాలయాదికంబులు కనకరత్నశిలామయంబు గా నిర్మాణంబు సేయించితి; స్వామ్యాజ్ఞాప్రకారంబు గా దారువులు నేతెంచె; నవి విగ్రహంబు లొనర్చుట దుర్ఘటం బై యుండె నిప్పు డొక్కల్యాణపుంగవాసుం డమానుషతేజుం డగు విశ్వకర్మ యప్రతిమంబు లగు ప్రతిమంబులు నిర్మింతు ననియును బదిరెండహోరాత్రంబులు జనసంచారంబు లేకుండ వలయు ననియును దన్నెరులు పరికించిన కార్యవిఫలం బగు ననియునుం జెప్పె నిది దుర్లభంబు; మీర లభిమానించి నాయందుఁ గటాక్షించి శ్రమకు నోర్చి యేతత్ప్రకారంబు సలుపవలయు నని ప్రార్థించినఁ బార్థివునకుఁ బౌరు లిట్లనిరి.

శా. రాజేంద్రోత్తమ! యుష్మదాజ్ఞకును మా కాడంగ నో రాడునే?
మాజన్మంబు కృతార్థతం బొరసె సన్మానీశహృత్పంకజ
భ్రాజిష్ణుం భగవంతుఁ దెచ్చి తది మాభాగ్యం బె; యే మెల్ల ని
ర్వ్యాజవ్యాప్తిఁ జరింతు మిండ్ల కడ మీవాక్యానుసారంబుగన్.

వ. అని పౌరులు సమ్మోదంబుగాఁ బల్కిన 143

చ. ధరణిపు డాత్మ సంతసిలి దవ్వులఁ బౌరులఁ బోవఁ బంచుచున్
మురిపెముతోడ భక్తునిఁ గనుంగొని నీయనుకూలపద్ధతిన్
గరపితి నెల్లవారలకుఁ గావున నీవిఁక విగ్రహంబులన్
గర మనురక్తిఁ జేయు మనఁగా నతఁ డెంతయుఁ బ్రీతచిత్తుఁడై. 144

క. అవధారు దారురూపులు
అవధారు రచింతు నేను నవనీశవరా!

రవిసంఖ్యాకదినంబుల
నవధారు మహాపరాధు లవదాతగుణా! 145

వ. అని సాభిప్రాయంబుగాఁ బల్కిన మానవేశ్వరుం డనుమానంబు వలన దీమానుషం బగునిక్కార్యంబు నీవలన నిర్వహించుట కేము నిశ్చయించుకొనిన వార మనిన నతం డట్ల సేయుదు నని వారిం బొమ్మని సమ్మదంబునం దేల్చుచు దేవాలయాంతరాళంబునకుం బోయి తత్తచ్ఛిల్పనైపుణంబున కరుదందుచు సాయంసమయపర్యంతము నందు యుండి నిశాసమయంబున దారుమూలంబులు తూలఖండంబులుం గొని నెత్తిఁకొని పోయి కనకమణిబంధురం బగుసింహద్వారకవాటంబు బంధించి సమాధియోగంబున విగ్రహనిర్మాణధురీణుండై యుండె నంత నిక్కడ, 146

మ. క్షితినాథోత్తముఁ డాప్తమంత్రిజనసంసేవ్యుండు నై యక్కటా!
శతివృద్ధుం డొకఁ డేగుదెంచి తగనాప్సామ్యాకృతుల్ చేతు నం
చతులప్రక్రియఁ బూనినాఁ డిది మహాశ్చర్యంబు చూడంగ న
ద్భుతసంకల్పుఁడు దేవుఁ డంచు భగవత్పూజావిధానాత్ముఁడై.

సీ. సకలప్రబంధానుసంధానచాతుర్య
ధుర్యు లౌ భాగవతోత్తములును,
నవ్యగానమధుస్వనార్ద్రీకృదశ్మని
కాయు లై చెలఁగెడు గాయకులును
నిఖిలేతిహాసనసన్నికరార్థవాదాను
మోదు లౌ భక్తిసంపాదకులును
వాచామగోచరాద్వైతమహానంద
భోగానుభావు లౌ పురుషవరులు
గొలువ సద్గోష్ఠిఁ జెలఁగుచు కువలయేశు
డచ్యుతాంఘ్రిసరోజయుగచ్యుతాప్ర

తాబ్ధికలశోద్భవోపమితాత్ముఁ డగుచు
జాగరూకత దినములు జరుపుచుండె. 148

వ. ఇట్లున్న పదంపడి పదిదినంబులకు రాజమాత తనమనంబున విశ్వకర్మపుత్త్రిం దలఁచి జరాభారపీడితుండు గావున నిద్రాహారంబులు లేక యెట్లున్నవో యని తలంకుచుఁ గుమారుం బిలిచి యతికరుణంబుగా నతని కిట్లనియె. 149

ఆ. నాకుమార! వినుము నాకు మూఁడవు
దానఁ జేసి పలుకుదాన ననినఁ
దల్లి! సుగుణగణమతల్లి రో యేమిటి?
యేమి; టంచుఁ బలికె నామెతోడ. 150

చ. విపులజరాసమన్వితుఁడు విగ్రహముల్ తగఁ జేతు నంచుఁ దా
నెప మొకఁ డేర్పరించుక చనెం దశవాసరముల్ గతించె వా
డపగతజీవి కాడె? యకటా! క్షుధచేత నశింప కున్నె యా
కపటపునెత్తగాని నిఁకఁ గన్గొనఁ గావలయుఁ గుమారకా! 151

వ. అనిన జననితోడ; 152

మ. జననీ! నీ విటు లాడఁ గూడ దతఁడుఁ సాక్షాత్కరించె న్భవిఁ
వనజాతాయతనేత్రుసత్కృపను; విశ్వబ్రహ్మవంశోత్తముం
డనుమానింపఁ గ నేల నింతయు నిరూఢం బమ్మకో! నమ్ము మీ
వన నామాత దయాసమేత యనివార్యాలాపసంఘాత యై. 153

తే. తలఁచునట్టులె చేయుట తగవు గాదు;
పాటి సేయంగఁ దగును మామాట కొంత;
మాతృదేవత మాటలు మనుప కునికి
సొబగు గా దయ్య! వేగ మ చూడు మతని. 154

ఆ. తల్లిమాట వినక దశరథరాముండు
నెట్టివారుఁ బడనియిడుమఁ బడ డె

తల్లి కార్తిఁ జేసి తగ భృగురాముండు
నన్యలోకగతి కనర్హుఁ డయ్యె. 155

వ. అని మఱియు కోపోద్దీపితముఖి యై యనేకవిధంబుల నిర్బంధంబులు పలికిన తల్లిమాటల కుల్లంబు ఝల్లన ధరణీవిభుం డొల్లంబోయిన, నెల్లవారు నట్ల పలుక నెట్టకేలకు మెల్లన గతిపయసమేతంబుగా సురాలయంబు కడ కరిగి కక్ష్యగోపురప్రాకారంబులుగడచి కవాటంబు సముదంచితమణిఘృణిజాలకం బగుకుంచెకోలం దిగిచి లోపలికిం జని నలుదిక్కులం జూచిన విశ్వకర్మపుత్త్రిం డదృశ్యుం డయిన వికలేంద్రియుం డై నేలం బడి పొరలుచు శోకపరవశుం డై మూర్ఛిల్లి బుధజనబోధితుం డై తెలిసి మఱియుసుం బరికించినఁ బీఠంబునం జేరి, 156

సీ. చిరునగుమొగము ముకురముల బోలు క
పోలముల్ సొగ సైనభుజలతికలు
వెడదయురము కృప వెదజల్లు చూపులు
తెలిదమ్మిరేకులఁ దెగడు నక్షి
కన్నవయు బలుచొకాటఁపు సోగము
క్కుదరము కెదురగు గొప్పగళము
ననఁటికంబము బోలు పెనుతొడలు వయార
మొలుకు పొన్నపువు నా బొడ్డు గలిగి
సకలసౌందర్యసార మై జనమనోను
రంజకం బైన పురుషవిగ్రహయుగంబు
కేవల రమారమణి శుభాకృతి వహించె
ననెడు స్త్రీవిగ్రహ మొకండు నం ద యుండె. 157

వ. ఇట్లున్నవిగ్రహత్రియంబునకు సకలావయవంబులు పరికించి కరపాదతలంబులు లే కుండుటఁ గనుంగొని మనంబునం దలపోయుచు

ద్వాదశవాసరంబులకు రెండుదినంబులు కొఱంత పడి యుండం దన
వచ్చుటం జేసి రథకారకుం డదృశ్యుం డయ్యె; విగ్రహంబులు సాం
గంబులు గాక నిలచె నింతయు నాత్మదోషంబున ని ట్లయ్యె నింక
నేమి సేయుదు నెందు జొత్తు నేది తెరువు మంత్రులారా! యని రాజు
పలవించుచు నిజజననివలన నింత దురవస్థ పాటిల్లె నని నిశ్చయించి
వారలతోడ, 158

క. స్త్రీబుద్ధిః ప్రళయాంతమ
నే బహుళజనాభివాద మెఱిఁగి యెఱిఁగి యు
శాబాసు! భంగ పడితిని
యీబాముస కేముపాయ మెఱిఁగింప రయా! 159

వ. అనిన రాజుం బట్టుకొని సమస్తజనంబులు గద్గదస్వనంబులతో
మూరార్చుచు నార్తి మూర్తులైనవిధంబున నుండి రంత భగవత్కూ
టాకుంబున నశరీరవాణి వారల కిట్లని యెఱింగించె. 160

మ. భగవద్భక్తుఁడు బ్రాహ్మణప్రియుఁడు వాక్ప్రామాణ్యసంచారి స
ర్వగుణాలంకరణాభిరాముఁ డనుచున్ రాజేంద్రుపైఁ గూర్మిచే
భగవంతుం డవతార మొందెఁ గరముల్ పాదంబులున్ లేమికిన్
వగ మీ కేటికి? యామహాత్ముని లసద్వ్యాపార మట్లుండఁగాన్

క. కావున నీశ్వరు విలసన
మీవిధమున సిద్ధ మయ్యె మీ రిందుకు శో
కావేశ మంద నేటికి
కోవిదజనులార! మీ రకుంఠితమతులై. 162

వ. స్వామివిగ్రహప్రతిష్ఠావిధానంబు మానవేంద్రుం డనుసంధించు
నుపాయంబు విచారింప వలయు నింతియ కాని వగవం బని లే దని
యాకాశసరస్వతి వినుపించిన భూకాంతప్రముఖజనలోకం బద్భుతప్ర

మోదాయత్తచిత్తు లగుచు దిగ్గన లేచి పురంబునకు వచ్చిరి; తదనంత
రం బ 163

శా. ఈవృత్తాంతము రాజమాత విని పృథ్వీశాగ్రిణిం జూచి శో
కావిర్భావత నొందినాఁడవు మదీయాలాపసంస్కారివై,
యీ విట్లుండుట కేను కారణ మనై తిం కేమి సేతుఙ సుత
శ్రీవిధ్వంసినియైనమాత ధరణిం జీవింపఁ గా నేటికిన్. 164

తే. అని యనేకవిధంబులఁ బనవు చున్న
తల్లి నూరార్చెఁ దనయుండు దైవఘటన
మిట్టు లున్నది కాన నీ వేమి జేసి
తమ్మ! విన వమ్మ! నావిన్నపమ్ము; తల్లి! 165

వ. శ్రీమన్నారాయణుండు బౌద్ధావతారుండై కరపాదంబులు కోఱం
తగా నుండుట కభిలషించె ననియును మీవలన నైన దోషంబుఁ
గాదనియును శీఘ్రింబ ప్రతిష్ఠింపుటకై బ్రహ్మదేవుం దేవలయు నని
యును నశరీరవాణి వినుపించెం గావున నేను బ్రిహ్మలోకంబునకుఁ
బోవ నిశ్చయించిన వాఁడ మీ రింక నిశ్శంక నుండవలయు నని
యూరార్చిన నామె నిస్సీమానురాగంబున నుండె నంత నయ్యింద్ర
ద్యుమ్నుండును సకలరాజ్యభారంబు యజ్ఞనకుమారునియందుఁ బ్రతి
ష్ఠించి సకలసామంతమంత్రిజనప్రముఖు లతని యాజ్ఞానువర్తులై
యుండ నియోగించి తానునుఁ బద్మసంభవదర్శనోత్సాహలంపటుండై;

సీ. మాహేంద్రికాధిష్ఠ మయినదినంబున
భూసురాశీర్వాదములు చెలంగఁ
గనకకన్యాప్రముఖాద్యనేకంబులు
సత్పాత్రిదానములు సల్పి మఱియు
హరిపాదపద్మసమారాధితుం డయ్యు
గురుజనానుజ్ఞలు గొనుచుఁ బిదపఁ

పౌరజానపదాదిప్రజల కిష్టావాప్తి
గురిసి వారల వీడుకోలు వడసి
లలితసాధ్వీవిముక్తసేసలు వహించి
నవ్యమణిదీపనీరాజనములఁ జెంది
విజయవాదిత్రనాదముల్ వెలయుచుండఁ
బ్రహ్మఁ గనుగొన వెడలె నప్పార్థివుండు. 167

వ. ఇట్లు వెడలి సమస్తజనంబులు తనతోడన రా వారల నెట్టకేలకు నివారించి యొక్కరుండును బట్టణంబు వెలువడి యుత్తరాభిముఖుండై శమనావతి దాఁటి యొక్కవటభూరుహంబుక్రిందఁ గూర్చుండి పద్మాసనుండై పద్మామనోహరుఁ దనహృదయపద్మంబున నిలిపి బుద్ధీంద్రియాదివికారంబులు వదలి యాత్మాభిగమ్యుండై బహిస్సంచారంబులు లేక యంతర్నిరీక్షుండై ఖేచరముద్రాభిముద్రితవిలోచనుండై సమాధినిశ్చలంబున యోగధారణంబున దేహంబు దూలరాశియుం బోలె తేలుచు ఖేచరత్వంబునఁ బోవి మహాపథంబునం బడి ముందట మాయాంధకారంబుగతి నున్న మేఘమండలంబు దాఁటి తదుపరిస్థితం బగుగంగామహానదీత్రయావగాహుండై యందున్న హంసంబులకుఁ దదావృతంబు లగుచంచరీకనినదంబునకు నరుదందుచుం బోయి తనవంశకూటస్థుం డగుసూర్యునిమండలంబుఁ జొచ్చి తదున్నతస్థలంబున స్వచ్ఛపదార్థం బైనయమృతకిరణుం గని తజ్జన్యం బగుమనంబున నధిగమించుచు నిర్ఖేదుండై తదూర్ధ్వంబు లగుసత్యలోకతపోలోకంబు మొదలగు ననేకలోకాంతరంబులు భేదించుచుం బోయి బ్రహ్మలోకంబుఁ బ్రవేశించి యందున్నముహూర్తమాత్రంబునకుఁ బ్రపంచస్పృహాపథుండై బాహ్యదృష్టిం బరికించి యేమియుం దోచక, 168

క. పురమే దని తను నిలచిన
తరు వే దని భయముచేతఁ దడఁబడఁ జొచ్చెఁ

పురుషున కనుమానం బే
పరమబ్రహ్మవలోకబంధకము గదా! 169

వ. ఇట్లుండి స్వామికటాక్షంబునఁ బ్రబోధితుండై బ్రహ్మలోకంబు
నకు వచ్చితి నని సంతోషింపుచు విశ్వకర్మఁ గనుంగొనునుపాయం
బె ట్లగు నో యని విచారింపుచు, 170

సీ. ఎక్కడఁ జూచిన, నెంతొ కిన్నరమరు
ద్గంధర్వసుందరీగానరవము,
లెక్కడఁ జూచిన నింద్రాగ్నియమధనే
శాదిగీర్వాణసంశ్లాఘనంబు,
లెక్కడఁగన్నవశిష్ఠవ్యాసాత్ర్యాది
సనకసనందనసద్వినతు లె
య్యెక్కడఁ జూచిన యేకోపరబ్రహ్మ
మన్నిశువేదాంతసిద్ధాంతపద మె
యహహ! పరికింప వినుతింప నగునె వశము
భానుకోటిసహస్రశోభావిరాజ
మాన మై దుర్నిరీక్ష్య మై పూని వెలుఁగు
గడలు నిండినబ్రహ్మలోకంబు మహిమ. 171

చ. అని వెరగందుచు న్నరవరాధిపుఁ డెవ్వరిఁ జూడ లేక నె
మ్మన మురియాడుచు న్నిలచె మౌనివరుం డలనారదుండున
జ్జనపతిఁ జూచి నీ విటకుఁ జయ్యన వచ్చుట కేమిహేతు వో
యన్నిన నతండు నమ్రుఁ డయి యాతనిఁ జేరి ప్రహృష్టచిత్తుఁ డై.

క. నారద! నిజతనునిర్జిత
పారద! మిముఁ జూడఁ గంటి భక్తివిధేయా!
కారుణ్యామృతధారా
సారము చిలికించి తహహా! సంయమివర్యా! 173

వ. అని నుతించి మహాత్మా! యేను భగవద్విగ్రహప్రతిష్ఠావిధానం బునకు బ్రహ్మదేవుం దోడ్కొని పోవుటకు శ్రీమన్నారాయణవాక్యా నుసారంబుగ వచ్చి సురవలోకం బగుట వెర గందుచు సరసిజోద్భవుం గానలేక నిచ్చట నున్నవాఁడ; భవద్దర్శనంబు దొరకెం గావున నింకఁ గృతార్థుండ ననిన నవమ్మౌనిశేఖరుండు; రాజా! మాబోఁటులకు దుర్లభం బైనభవత్ప్రియత్నంబు దుష్టటం బైన నీ విచ్చట న యుండు మే నయ్యబ్జభవుసందర్శనంబుచేసి వచ్చెద నని పోయి బ్రహ్మచేత సత్కృతుం డై యచ్చటివా రెల్ల విన నవ్వనజభవుతో ని ట్లని విన్న వించె. 174

మ. కలఁ డాత్మీయయశస్సుధాకరమయూఖాళీపరిక్షాళితా
ఖిలభూమండలదిక్కటాహమిళితైకీభూతజంతువ్రజో
త్కలికాత్మీయమహాయావిమర్శగిరిభిత్ప్రఖ్యానుఁ డై నట్టి సా
ర్థలసన్నామధరామనోరమణుఁ డింద్రద్యుమ్నచంద్రుం డిలన్. 175

వ. ఏవంవిధగుణగరిష్ఠుం డగునారాజసార్వభౌముం డుత్తరదేశంబునందు దేవతాయతనంబులు నిర్మించి శ్రీమద్భగవదవతారకారణంబు లగు దారుత్రియంబు విగ్రహంబు లొనరించినవాఁ డై ప్రతిష్ఠసేయుటకు భగవద్వాక్యానువర్తి యై దేవరను దోడ్కొని పోవ నిటకు వచ్చి యున్నవాఁ డితండు బహుపుణ్యాత్ముండు, గోవిందచరణారవిందనిష్యంద మకరందపానతుందిలాయమానమానసుండు; యుష్మదనుగ్రహంబు నకుఁ బాత్రుం డగు నని విన్నవించిన, విరించి రాజపురందరుఁ దోడ్కొని తేరం బంచిన నతం డనివారితదౌవారికుం డై పోయి యనేకకక్ష్యాంతరంబులు గడచి చనిచని, 176

సీ. ఒకముఖం బఖిలవేదోచ్చారణాగమ
సంహితాలాపముల్ సలుపు చుండ

నొకముఖంబున జంతునికరసంసృష్టిచా
తుర్యవాక్సంపద దొంగలింప
నొకముఖంబటఁ గనకోన్నతసింహాస
నాసీనవాణితో నలరుచుండ
నొకముఖం బనితరప్రకటితాద్వైతంబు
మౌనిసంఘంబుతో మలయుచుండ
నిన్నివిధములఁ జెలఁగుచు నింపుకొలువు
నందు వేంచేసి యున్నయానలినభవుని
జూచి తిలకించి పులకించి చోద్య మంది
ధరణినాథుండు సాష్టాంగ మెఱఁగి లేచి; 177

క. నారాయణనాభీపుట
సారససంజాత ! ధాత ! సన్మౌనినుతా !
నారాక మీకుఁ దెలిపెద
మీరెఱుఁగని దేమి గల దమేయగుణాఢ్యా! 178

వ. అయినను విన్నవించెద నని జోహారు వెట్టిన వనజోదరుం డు సాదరంబుగా నతనిం జూచి భూవల్లభా! నీ విటకు వచ్చుట ముహూర్తమాత్రం బైనను భూలోకంబున ననేకసంవత్సరంబులు పరిపాటితోఁ జెల్లె నీరాకపోవుట చూచి కాలాతిక్రమణం బగుట నీవారలు నిరాశులై విచారించి మత్సమాను లగుమహాపురుషులచేతం బ్రతిష్ఠ గావించి శ్రీజగన్నాయక, బలభద్ర, సుభద్రా, విధేయంబు లొనర్చి నిత్యంబును సకలోత్సవంబులు సలుపు చుండి రందు పంచమతురుష్కజనంబులు దక్కం దక్కిన నిఖిలవర్ణంబులవా రేకపాత్రియందు స్వామిప్రసాదంబు గొనుచున్నవారు సాయుజ్యైకకుంభంబునుం బోలె వెలుంగుచున్నది నేమును భవిష్యత్కాలంబున వచ్చువార మింక నీ వతిత్వరితగతిం

జని స్వామి సేవింపు మని యాన తిచ్చిన నతివిహ్వలమానసుం డై సభాతలంబునం బడి మూర్ఛిల్లి నారదాదు లనునయింప లేచి కంప స్వేదగాత్రింబుతో వినువారికి ననుకంప వొడమ గద్గదస్వనంబున నిట్లని విలపించె. 179

ఉ. క్రూరుఁడ ద్రోహుఁడఁ జడుఁడఁ గుత్సితుఁడన్ బహుపాపకర్ముఁడన్
శ్రీరమణుండు న న్నిటకుఁ జేరిచి వంచన నాదుకష్ట మి,
ట్లారడి నొందఁ జేసి తగ నన్యులచేతఁ బ్రతిష్ఠ నొందె నిం
కారయ నాకు ది క్కెవరు కంజదళేక్షణుఁ డింత చేయునే. 180

వ. అని యనేకవిధంబుల విలపించు చున్న, నలినోద్భవుండు దయాముఖుం డై నీ వి ట్లేల జాలిం బొందెదు; నీ వింక నిశ్శంకం బొ మ్మచ్చటఁ బంకజనాభుం డనుగ్రహించు నని యూరార్చి భూలోకంబు నకుఁ బోవునుపాయంబు సెప్పిన నన్నరనాథుండును నారదాదిమహామునులయుఁ బద్మసంభవాద్యమరలోకంబులయు ననుజ్ఞ గొని వారల నామంత్రిణంబు చేసి తత్క్షణం బ భూతలంబున కవతరించి జగన్నాథపురంబుఁ బ్రవేశించి, 181

ర. భూరిఘనధ్వని భేరీరవములు, కాహళమర్దళఘంటారవములు
తంబురవీణాతాళస్వనములు, కంబుధ్వనులునుగాయకగీతులు
వేశ్యానటనలు వేణువిరావము, మంగళవాద్యములుంగడుఁజెలఁగుచు
ధీంధిమినాదము దెసలుపిక్కటిల, మృగమదపూతలమేచకకాంతులు
కదళీస్తంభాకల్పితరచనలు, ముత్తియముగ్గులు మొగలిదళంబులు
కువలయతోరణకోటులు మొల్లలు, మల్లెలుజాజులుమంచిసంపెంగలు
కల్పసుమంబులు కంజాతంబులు, నగరుధూపములు హారతికర్పూర
మెక్కడఁజూచిన మేరకు మిగులుచు, ఘుమఘుమ ఘుమ్మన
కోటిసూర్యమై

మణిదీపంబులు వెలయుచునుండఁగ, వింజామరములు విసరెడు
వారును
గంజదళేక్షణుఁ గన్గొనువారును, భక్తజనావన పరిపాలయ మాం
శ్రీపతియనినుతిఁ జేసెడువారును, మెలఁగిప్రసాదము మెక్కెడివారును
నొక్కటియై జను లుల్లాసంబునఁ, గోలాహలమైకోవెల చుట్టును
శబ్దబ్రహ్మము ఘూర్ణిల్లి మొరయఁగ, భూపతి గన్గొని పొల్పతి
మదిఁదా
నెక్కడి దీవుర మెక్కడి దీగుడి, యెవరు రచించిరి కేమిటివింతని
తలఁచుచు దేవునిదగ్గఱకుంజని, యెదురుగనంజలి యెత్తుచునిలచెన్;

సీ. ఈవిధంబున నిల్వ నెవ్వరు నీ వెవ్వ
రనువారు లేరైరి యతనిఁ జూచి
భూపతి మదిలోనఁ దాపంబు నొందుచు
సార్వభౌమఖ్యాతి సంచరించి
యచ్యుతకరుణాకటాక్ష భాజనుఁడనై
తుదకు నిరాలంబపదము నొంది
నాఁడ నిం కేమియు నాసేయునది లేదు
యీశ్వరాధీనంబు లెల్లపనులు
గాన వగవంగఁ బని లేదు కష్టమెల్ల
నిత ఫలియించె నక్కటా! వింత యనుచుఁ
గరతలంబులు ముకుళించి గద్గదికను
భక్తి నుతియించె బాష్పాంబుసిక్తుఁడగుచు. 183

వ. ఇట్లు భగవంతుం బ్రార్థించు చున్నం జూచి యాపన్నరక్షకుం
డగుజగన్నాథుండు ప్రసన్నుండై యన్నరవరుం దనసన్నిధికిం దోడ్కొని
పోవం దలంచి యచ్చట నున్నయర్చకగణంబులం జూచి వారలతో
ని ట్లనియె. 184

క. నరవరుఁడు ఖిన్నుఁ డగుచును
వెరచుచు నున్నాఁడు గాన వేగ మ మీరం
దఱు మాబికుదులు గొని చని
పరుగునఁ దోడ్కొనుచు రండు పరమప్రీతిన్. 185

మ. అనిన న్వా రటు చేయ భూపతి ప్రహర్షాయత్తుఁ డై వచ్చి యో
వనజాతేక్షణ! భక్తవత్సల దయావార్ధీ జగన్నాయకా!
యనుచున్ జాగిలి మ్రొక్కి లేచి భవదీయాపాంగవీక్షేతరున్
నను బిల్పించుట ధర్మమా నరహరీ నాభాగ్య మిట్లున్నదా? 186

ఉ. నీవుప్రతిష్ఠకై యరిగి నీరజసంభవునొద్ద నిల్వ న
గ్గా దనీ మీర లిచ్చట నఖండశుభోదయ మొందినారలే
నీదయ నాముపాప్తి యిఁక నెట్టు లొనర్చిన వార మంతయున్
నీది యె నాదు పేరు ధరణిన్ వినరాదు గదా! గదాధరా! 187

మ. అని కైవార మొనర్చుచున్న విని లోకాధ్యక్షుఁ డామోదసం
జనితాలాపకలాపుఁ డై పలికె నీ సత్యంబు, శాంతంబు, దాం
తి, నిగర్వప్రీతిభావిశేషముల, కెంతే మెచ్చి యిచ్చోటికిన్
జనుదేర న్మది నుత్సహించితిమి నిన్నం దేవ మూర్వీశ్వరా! 188

క. నీసామ్యమువలనఁ గలిగెను
భాసుర మై మత్ప్రతిష్ఠ ఫలభాగివి నీ
వే సుమ్ము సమ్ము మొకఁ జే
శాసించెద ధర్మశాస్త్రసమ్మతి గాఁగన్. 189

వ. అది యెట్లంటేని, 190

చ. మతిఁ బరికింపు విగ్రహవిమానగృహాంగణముఖ్యముల్ స్వయం
కృతముఫలంబు నీయది య రెట్టి ఫలించెఁ బరప్రతిష్ఠ కు
న్నతి యొనరించినందువలనన్ మఱి యన్యులు గారు వారు నీ
సుతులె దలంపఁ గావున విశోకమతిం బరికింపు మంతయున్. 191

వ. నీవు బ్రహ్మలోకంబునకుం బోయి మరలుటలేక యున్న సుసంప
న్నంబు లైనపదార్థంబులు వ్యర్థంబులు సేయలేక శ్రేయాంసిబహువి
ఘ్నానియని బుధులు చెప్పుదురు గావున మీవారలు వేగిరపడి ప్రతి
ష్ఠించిరి మేము నీవొనర్చినయది గా భావించి యూరకున్నవారము
నీకన్న మాకత్యాసన్నులైవ యున్నవారడియనుం గాక భానువంశ
దీపకుండ వగునిన్ను మాకన్నవారుగాఁ జూచుకొనియెదమన్నా!
యని యనేకవిధంబుల ననునయించి సమస్తజనంబు లత్యాశ్చర్యమా
నసు లై శతానందపురందరాద్యమరలోకంబునకు సనకసనందనాది
మునిబృందంబునకు నందరానిశ్రీగోవిందుఁ డిందిరాద్యమ్మున కిట్లతి
దయానంసందర్భగర్భితం బగువాఙ్మకరందం బొసంగు నె యెందు నిట్టివి
చిత్రంబులు చూచితి మె యీపరమపవిత్రుం డగుధాత్రీపతివలనం
గృతార్థుల మైతి మని బ్రహ్మానందంబునం దేలుచుండి రంత మఱియు
నాజగన్నాథుండు నరనాథున కిట్లనియె. 192

ఉ. నీదుమనోనుకూలముగ నే నొకఁ డాడెద నొంచుచోట నా
మోదముతోడ దేవగృహముం ఘటియింపు మహోత్సవంబుతో
ద్వాదశమాసగర్భితవిధాయిని యైనదినంబులందు ల
బ్ధావ దొడంగి నిల్తు మదియంతయు నీయది గాఁ దలంపుమీ. 193

వ. అని మఱియు నబ్దాదయనం బుణ్యక్షేత్రంబుల నాషాఢమాసం
బగుం గావున శుక్లప్రతిపత్ప్రభృతి ద్వాదశీపర్యంతంబు మేము
మువ్వర్గము మూఁడురథంబులతో నిచ్చటినుండి యచ్చటికి మహో
త్సవంబుతో వచ్చి నివాసంబుచేసి సకలజనంబులు తీర్థప్రసాదంబులు
గొను నట్లుండం గలవార మట్టిదినంబుల మమ్ము సేవించినవారికి సంవ
త్సరంబు మత్కైంకర్యంబు చేసినఫలం బొసంగువారము; నీపేరుప్ర
తిష్ఠ లాచంద్రార్కతారకం బై సకలలోకప్రసిద్ధం బై యుండం గల

యవి; విన్నను యజ్ఞసకుమారుని( జేర్కొనినవారికి సకలదురితంబు
లుం బాయు ననియును భగవంతుం డాన తిచ్చిన యిందద్యుమ్నుం
డును బ్రహ్మానందభరితుం డై దేహంబు మఱచి కొంతతడవునకుఁ
దెలిసి యంజలి యగుచు భగవంతుని దివ్యమంగళవిగ్రహంబుం
గన్నులారం గనుంగొనుచు నిట్లని వినుతించె. 194

మ. హరయే భక్తపరిదాయ గరుడాశ్వారూఢసమ్మోదినే
కరుణాక్షీణకటాక్షవీక్షణసుధాఖండపరివర్షాయ దు
ర్భరసంసారమహాంధకారపటలీభానుస్వరూపాయ శ్రీ
నరసింహాయ పరాత్పరాయ త్రిజగన్నాథాయ తుభ్యం నమః.

వ. అని బహుప్రకారంబులం బ్రస్తుతించి ప్రస్తుతకార్యాలోచనపరుం
డై; దేవా! దేవర యాజ్ఞప్రకారంబుగా దేవతాయతనంబు లొన
ర్చెద ననిన యట్ల పొమ్మనిన నమ్మనుజోత్తముండు సమ్మదంబున
వచ్చి పురంబుఁ జొచ్చి తనగృహద్వారంబుఁ జేరం జని మంత్రిపురో
హితప్రధానవితానంబు వచ్చి, యెవ్వరు నెఱుంగక యూరకున్నవార
లం బరీక్షించి తను నియోగించిన మంత్రిప్రముఖాదికంబు లోకాం
తరగతిం జెందినఁ దత్పరోక్షంబున వారలపుత్రపౌత్రులు తత్తదధికా
రంబులు గొని యున్నవారు గా నెఱింగికొంతతడవు విచారించి నిజ
పుత్రకళత్రంబులు స్వామికటాక్షంబున వైకృతి లేకుండుట కరు దం
దుచు నభ్యంతరంబునకుం బోవక బహిర్గృహంబున నివసించి పునర్దే
వాలయఘటనాకుతూహలి యై యప్పటికింగలుగు రథకారులం బిలి
పించి వారలతోడ; 196

క. ఓరథకారకులారా!
మీరాజును సుమ్ము యేను మీవాఁపనుల్
తోరముగఁ జేయ నేరిచి
నారా వై చిత్ర్యశిల్పనై పుణివెలయన్? 197

వ. అని వారలసబహుమానంబుగా సంభావించి మఱియు నేను దేవభవనంబు లొనరించి విగ్రహప్రతిష్ఠకై పరమేష్ఠిం దోడ్కొని వచ్చుటకు బ్రహ్మలోకంబునకుం బోయి యచ్చట న సంభవితకమలసంభవదర్శనుండ నై కించిన్మాత్రంబు దడ వైన మావారలు ప్రతిష్ఠ గావించిన నేను వచ్చి మత్కృతంబుగామికి నిర్వేదించిన వేదవేద్యుం డగుజగన్నాథుండు కరుణాసనాథుం డై యెం దేని మఱియొక్కచోట దేవమందిరంబు నిర్మాణించిన నందు నివసించెద నని యానతిచ్చెం గావున మీరలు పనిపూని కనకమణిశిలాబంధురంబుగా దేవతాయతనంబులు సంఘటింప వలయు ననిన వారును రాజానుశాసనంబునం దన్నిర్దిష్టస్థలంబునం బనిసేయం బూని రంత, 198

చ. మణిగణహేమగుంభితవిమానము రత్నమయూఖమంటపాం
గణములు సౌధవప్రశశికాంతవినిర్మితగోపురాళి ని
క్వణితదిగంతరాళపటుఘంటికలున్ రథముల్ విచిత్రనై
పుణము దలిర్పఁ గట్టి రలభూపతి మెచ్చఁగ శిల్పకారకుల్. 199

వ. ఇట్లు దేవాగారాదికంబులు సకలజనమనోరంజకం బై ద్వితీయస్వర్గంబునుం బోలె నిర్మించినం జూచి యింద్రద్యుమ్నచంద్రుం డానందసాంద్రుం డై జగన్నాథునిపాదసన్నిధికిం జని కరతలంబులు ఫాలంబునం గదియించి ప్రణతుం డై, 200

క. అవధారు జగన్నాథా!
భవదుక్తవచోనిధానపరిలబ్ధుఁడ నై
భవనంబులు రచియించితిఁ
బ్రవిమలసత్యానువాద! పరికింపఁ గదే. 201

వ. అనుటయు, నంత, 202

క. మందస్మితయుతనిజవద
నేందుండు గోవిందుఁ డనియె నృపవర నీ వా

నందింప నటకు వత్తుము
స్యందనముల్ దోడి తెమ్ము చయ్యన ననినన్. 203

క. ఈచొప్పున హరి కరుణన్
గై చేసెద ననిన చెవుల కమృతంబై భూ
పాచీనబర్హి కతుల
ప్రాచుర్యశుభావగాహపరిణతి గలిగెన్. 204

వ. ఇట్లు స్వామిసన్నిధిం బ్రసన్నవాక్యంబులు విని పెన్నిధిం గన్న పేదచందంబునం బొదలుచు వచ్చి మణిఘంటాఘణఘణాయమానం బులును గగనోల్లేఖితంబులు నగుశతాంగంబుల నభంగతురంగసహస్రం బులం బూన్పించి జగన్నాథుని సమీపంబునకుం దెచ్చి యచ్చటినుండి తాను నవీనంబుగా నిర్మించిన కోవెలలకడకు సమస్థలంబుగా ఘం టాపథం బొనరించి కస్తూరికావిలేపనంబులు ముక్తాచూర్ణవిన్యాసంబు నుం గావించి పరిమళద్రవ్యంబులు ఫలకుసుమదళంబులు చందనాగు రుతాంబూలజాంబూనదాంబరాభరణవస్తువాహనంబులు సమృద్ధంబు జేసి రథసమీపంబునకుం బుత్రకళత్రాదిబంధుజనంబులుం బౌరజానప దసచివపురోహితబ్రాహ్మణవర్గంబుం దనచుట్టునుం బరివేష్టింపం గరం బులు మొగిడ్చి భగవదారాధనపరుండై ప్రార్థింపుచుండె నంత, 205

మ. బలభద్రుండు సుభద్రయుయ్యురుపురుం బార్శ్వంబులం దోప ను
జ్వలకేయూరకిరీటకుండలగదాశంఖాసిచక్రాదులున్
దులసీమాలికలున్ సువర్ణపటమున్ దూణీరకోదండముల్
వెలయన్ శ్రీహరి నవ్వుతో నచటికిన్ వేంచేసె నుల్లాసియై. 206

వ. ఇట్లు మువ్వురు నిజార్చకజనహస్తవాహనంబుల బహిర్ద్వారంబునకు వచ్చి మనుజపతిమనోరథంబులుం బోలె నున్న రథత్రయం బవితథవి లోకనంబు లొప్పం జూచి యుప్పరం బెగసి రథంబులం బ్రవేశించి

రంత పురాంతకాదిబృందారకులును యిందాగ్నియమధనేశాదిదిక్పాలకులును సూర్యచంద్రాదిగ్రహంబులును యశ్విన్యాదితారకంబులును సురగరుడయక్షకిన్నరకింపురుషపన్నగమరుద్గంధర్వులును యశ్వనీదేవతలును వసువులును బర్వతనారదులును భృగ్వంగీరసవ్యాసవసిష్ఠాత్రిగౌతమకణ్వగార్గేయభరద్వాజాదిమహామునులును సనకసనందనసనత్కుమారసనత్సుజాతాదిబ్రహ్మమానసపుత్రులును మొద లగునూర్ధ్వలోకనివాసు లందఱు శ్రీనివాసదర్శనోత్సాహమానసు లై గగనమార్గంబున వచ్చి మేఘమండలాక్రాంతంబు లగురథంబుల నున్న దేవదేవులం గని వినుతించుకోలాహలంబు భూసంచారు లగుధారుణీశ్వరప్రభృతిజనలోకంబు విలోకించి విస్మితు లై జయ వెట్టుచు శంఖభేరీమృదంగకాహళపణవాదితూర్యంబులు వందిమాగధకైవారంబులు భూసురస్వస్తివాచకంబులు జయ జగత్ప్రభో జగన్నాథమూర్తీ! జయపుండరీకాక్షా! మారంరక్షేత్యాది మంత్రింబుల వినుతి సేయుభక్తాలాపంబులును గగనతలంబున దేవదుందుభిధ్వానంబులును యేకం బై భూనభోంతరాళంబు నిండి యోంకారనాదం బై శబ్దబ్రహ్మం బై జగదద్భుతం బై మొరయ హరికృపాతిరేకంబున తురంగంబులు లేకరథంబులు నడువ బహుజనాక్రమణంబున మందగమనం బొప్పగోవిందకింకరులు వేత్రహస్తు లై సందడి జడియ రథయాత్రసనాథు లగుజగన్నాథులం జూచినవారికిఁ బునర్జన్మంబు లే దనునిశ్చయంబుతో నిశ్చలంబుగాఁ జూచుచు జనంబులు కస్తూరికాకర్దమసంయుతం బగు పన్నీరుపెన్నిధులం బడి కంఠపూర్తి యగుటఁ గ్రిక్కిరిసి బయ లెక్కంగమకించి తత్సమీపంబున నున్నకర్పూరపుతిప్ప లినుకతిప్పలవిధంబున నెక్కిన, నవియును గొంతదడవునకుఁ గరంగినఁ దెరువు గానక, చెల్లెక్కి స్వామిని సేవించువారును, పుత్రమిత్రాదికంబులఁ దారును

రథంబుల కడ్డంబుగాఁ బడి స్వామికటాక్షంబునఁ నేమిఘట్టనం బేమి యుఁ దగులక తూలరాశియుంబోలె తేలిన సంతోషంబునం బరువు లెత్తువారును నై చిద్విలాసంబునం దోప నంతట సాయంసమయం బగుటయుఁ గరదీపికాసహస్రంబులుఁ బ్రభాతకాంతిద్యోతనక్షంబు లగు చంద్రజ్యోతులును వై శ్వాసరప్రభలకుం గాపురంబు లగులంకాపురు లును మఱియు ననేకనామరూపంబులుం గలధరాధిపప్రణీతంబు లగు చిత్రప్రభ లింద్రాదిదేవతల రత్నకిరీటకాంతులసన్నిధి ఖద్యోతపోతం బుల ననుకరింప నారదాదిమహామునుల దివ్యతేజఃపుంజంబుల కెదుర దేవతావతంసరుచిజాలంబు ఖద్యోతుని సమీపంబున నైన దీపంబుల గతిం జెంద నిట్లితరేతరన్యూనాధికభావంబులుం జూపఁ జూప జగ్గింప మహోల్లాసంబునం బోయి యింద్రద్యుమ్నాలయసమీపంబున నవ తరించి యథాపూర్వకంబుగా నర్చకహస్తవిన్యస్తులై యభ్యంతరమం దిరంబునకుం బోయి సింహాసనంబులం గూర్చుండి రంత. 207

చ. సరసిజసంభవాద్యమరసంఘము సర్వదిగీశముఖ్యులున్
వరమునిజాల మచ్చటికి వచ్చి శుభోజయ మంచుఁ బల్కుచున్
హరిఁ గొనియాడుచున్ నిజకరావళి సాచి ప్రసాదతీర్థముల్
కర మనురక్తిఁ బట్టిరి వికాసమనోల్లసితాననాబ్జులై. 208

వ. ఇట్లు పట్టి సమస్తజనంబులుం గలసి యుచ్ఛిష్టాన్నంబును వ్యంగ్య వికారంబులులేక సార్వత్రికంబును నిట్ల భుజియింప వలయు నని యును మే మంతంత వచ్చి యిట నివసింతు మనియును శాసింపుచు శ్రీజగన్నాథుని యనుజ్ఞఁ గొని వారందఱు నిజనివాసంబులకుం బోయి రిందద్రద్యుమ్నుండును బ్రద్యుమ్నదేవుని పాదసన్నిధి కరిగి ధరాతలంబునం బడి, 209

ఉ. దేవ! భవత్కటాక్షమున దివ్యసుఖంబునుఁ జెందినాఁడ నీ
భూవలయంబులోన జనపూజ్యుఁడ నైతిఁ గృతార్థుఁడన్ జగ

శ్రీపావనమూర్తి! భక్తపరిపాలనతత్పర! లోకనాథ మీ
రీవిధిచే యుగాంతరము లిల్లు చరింప ననుగ్రహింపవే! 210

వ. అని ప్రార్థించినం భగవంతుండు ప్రసన్నుం డై యతని దగ్గఱం డిగిచి భక్తరక్షణప్రశస్తం బగు తనహస్తంబున దేహస్పర్శనంబుఁ జేసి యనేకజన్మంబుల నన్నుం గొలుచుటం జేసి నీ కివ్విధంబు సంప్రాప్తం బయ్యె; భూపరిపాలనంబు సేయు చుండుము నీ కిష్టం బైన యెడ మమ్ముం దలంచుతఱిం బ నీపుత్త్రకళత్రాదికంబులతో మత్సన్నిధికిం గొనిపోయెద మని పల్కిన నతండు పరమసంతోషభరితుం డై స్వామికైంకర్యమహోత్సవంబులును రాజ్యపాలనంబును నెల్పుచు ననేకవత్సరంబులు సుఖం బుండె నంతఁ గొంతకాలంబునకు,

మ. జను లన్యోన్యవిరుద్ధవర్తనలు నిచ్ఛాలాపసంచారస
జ్జనవిద్వేషమదాభిమానకలుషానాసత్యప్రథాదుష్క్రియల్
మన మిం పారఁగఁ జేయఁ జొచ్చుచు మహామాయాకలివ్యాప్తి దు
ర్జను లై యుండుటఁ జూచి రాజుమదిలోఁ జర్జించి ఖిన్నాత్ముఁ డై.

వ. ఒక్కనాఁ డక్కమలాక్షుపాలికిం బోయి వినయవినమితోత్తమాంగుం డై దేవా! భూవలయం బఖిలంబు కలిసమాక్రాంతం బయ్యె నింకఁ బ్రజాపాలనం బొనంగుట కసమర్థుండ నైతి నింతియ కా దేను రెండువేలవత్సరంబులు జీవించితి సకలభోగభాగ్యంబులం దృప్తుండ నైతి దేహాధారణాపేక్ష లేశంబు లేదు; దేవరపాదారవిందసేవకుండ నై సన్నిధానంబున న యుండెద ననిన పుండరీకాక్షుం డింతయు నిజం బీభువనంబు దుష్టజనబలిష్ఠంబు గా నున్నయది భవదభీష్టప్రకారంబున ననుగ్రహింపం గలవార మనిన నమ్మనుజోత్తముండు శ్రీవైకుంఠగమనోల్లాసమానసుం డై గృహంబునకు వచ్చి, 218

సీ. మానవాధిపుఁడు పరిధానవర్గముఁ జూచి
కరుణఁ బాలింపుఁడీ ధరణి ననుచు
బ్రాహ్మణాఢ్యులఁ బిల్చి భవదమోఘాశీర్వ
చనయోగమున నిట్లు మనితి ననుచు
పౌరజానపదాది ప్రజలను బిలపించి
యోగ్యసంచారులై యుండు డనుచుఁ
బంధులఁ బిలచి సంభరణోపజీవులై
సచివానుమతిఁ గూడి జరుపు డనుచు,
నయముతో నుత శ్రీజగన్నాథదేవు
భక్తిఁ గొలువుఁడు పాపవిముక్తు లగుదు
రేను బోయెద వైకుంఠ మిాక్షణంబ
మిమ్ముఁ దలఁచుచు నుండుడీ మనములందు. 214

వ. అని చెప్పి భూభరణాకోపమాణు లగుపరిధానులతో మఱియును,

చ. ఇదివఱ కెంతయుఁ భవదహీనమనఃప్రతిభానుయోగస
ద్విదితధరాపతిత్వపదవిశ్రుతి నొందితిఁ గాదె! యింకనుఁ
సదయత నన్నసత్రములు సజ్జనవృత్తులు నగ్రహారముల్
వదలనిభక్తి స్వామిశుభవర్తనముల్ పరికింపు చుండుడీ. 216

వ. అని వారలకుఁ దత్తద్విధంబు లేర్పడం జెప్పి ప్రయాణోన్ముఖుం డై బ్రాహ్మణసమారాధనం బొనర్చి సమస్తదానంబుల వారలఁ దృప్తులం జేసి వారిచే దీవనలు వడసి తానును దనపుత్త్రకళత్త్రంబులును యజ్ఞదేవుండును నతనిదారాపుత్త్రులును దోడన రా జగన్నాథనివాసంబునకుం బోయి దేవునిదివ్యమంగళవిగ్రహంబుఁ గనుంగొని సేవింపు చున్నఁ బ్రసన్నుం డై భగవంతుండు తనయర్చకులం బోవం బనిచి కవాటంబు బంధించి యింద్రద్యుమ్నాదిభక్తజనంబులం దివ్య

కటాక్షవీక్షణంబు లంబు జూచిన వా రత్యానందాధియోగసాంద్రాధిరూఢసమాధినిశ్చయు లై తత్క్షణంబ దేహములతో వైకుంఠపురంబున కవతెంచి యచ్చట శ్రీమన్నారాయణచరణధ్యానంబు నల్పుచు సాయుజ్యం బగుశాశ్వతానందంబునం బొదలుచు సుఖం బుండి రంత.

క. ఇతిహాసవరం బిది యతు
లితమతిం జదివినను వినిన లిఖియించిన స
న్మతుల కిహపరసుఖము ల
చ్యుతుం డొసంగెద ననుచుం బలికె సూన్మృతఫణితిన్. 218

సీ. పుత్రార్థులకు మహాపుత్రసమృద్ధియు
భోగార్థుల కఖండభోగములును
విజయార్థులకు సర్వవిజయవిఖ్యాతియు
నాయురర్థుల కెల్ల నాయురాప్తి
విద్యార్థుల కనేకవిద్యాప్రవీణత
మోక్షార్థిజనులకు మోక్షపదము
నైశ్వర్యకాముల కైశ్వర్య సంప్రాప్తి
స్వర్గకాములకును స్వర్గలబ్ధిఁ
గలుగఁ జేయుదు నే నని కమలనయనుఁ
డాన తిచ్చెను గావున మానితముగ
నీజగన్నాథమాహాత్మ్య మెల్లజనులు
భక్తిఁ జదువుఁడి వ్రాయుఁ డాసక్తి వినుఁడి. 219

క. నరు లెవ రైనను దీనిని
పరిహాసము జేతు రేని బహుపాపసము
త్కరయుతు లగుదురు కావునఁ
గరము ప్రశంసింప వలయుఁ గౌరవ మొప్పన్. 220

వ. అని జగన్నాథదేవుఁడు సకలజనసముదాయంబు వినం బలికెఁ గావున నీజగన్నాథమహాత్మ్యం బెల్లవారికి పఠనయోగ్యంబును బూజనీయంబు నని యెఱుంగవలయు. 221

ఉ. నీలపయోదమండలవినిర్జితదేహ! సుపర్ణవాహ! ని
ర్మూలితకామరోషమదమోహసమూహ! దురంతకల్మష
క్షాళనకృత్పదాంబురుహ! సంజనితోత్తమగంగ! రంగ! శో
భాలలితాంగ! భక్తజనపాలన! చిన్మయసౌఖ్యఖేలనా! 222

## మాలిని.

స-15

సకలసుజనపాలా శాశ్వతానందలోలా
వికచకమలనాభా వీతరోషప్రలోభా
ప్రకటితనిజకీర్తీ భక్తలోకానువర్తీ
సుకరగుణకలాపా శోభితాఖండచాపా 223

గద్య: ఇది శ్రీమద్గౌతమగోత్రపవిత్ర రామయామాత్యపుత్ర
సుజనవిధేయసూరయనామధేయప్రణీతంబైన
శ్రీజగన్నాథమాహాత్మ్యంబునం ద్వితీ
యాశ్వాసము; సర్వంబును
సంపూర్ణము.